# శతావధాన శారద



శతావధాని శేఖర

డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్




డా॥ చివుకుల సుందరరామశర్మ, శ్రీ కావూరి పూర్ణచంద్రరావు, అవధాని, శ్రీ మల్లాది సుబ్రహ్మణ్యశర్మ, డా॥ జంధ్యాల మహతీశంకర్

# శతావధానశారద

(ఏకదిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన సంచిక)

శతావధానిశేఖర

డాక్టర్ పాలపర్తి శ్యామలానందప్రసాద్

ప్రచురణ

చెవుటూరి ఛారిటబుల్ ట్రస్టు

విజయవాడ

# ముద్రాపయితలు



ఎవరున్ జేయని రీతి నేకదిన సాహిత్యక్రతుస్ఫూర్తి నే
నవధానంబు శతాకృతిన్ సలుప దేవ్యారాధనా - తత్పరుల్
చెవుటూర్యన్వయ పుణ్యదంపతుల ఆశీరూపమిట్లొప్పె, తాం
డవకృష్ణున్ కుసుమాంబికన్ కరుణతోడంజూడు వాగీశ్వరీ!

## అవధాని తల్లిదండ్రులు



బ్రహ్మశ్రీ వేంకట సుబ్బారావు        శ్రీమతి పూర్ణాంబ

# శుభాకాంక్షలు

"తవ స్తన్యం మన్యే ధరణిధరకన్యే హృదయతః
పయః పారావారః పరివహతి సారస్వతమివ,
దయావత్యా దత్తం ద్రవిడశిశు రాస్వాద్య తవ యత్
కవీనాం ప్రౌఢానామజని కమనీయః కవయితా॥

"హిమగిరి సుతవైన చల్లని తల్లీ! జగన్మాతా! నీ స్తనములనుండి స్రవించిన సారస్వత సుధాధారలను ఏ జన్మనో దయతో నాచేత త్రాగించియే ఉంటావు. తల్లీ! లేకున్న ద్రవిడ శిశువునైన నేను ఇంతటి ఉద్దండ కవి పండితుల ఎదుట నా కవితారీతులతో సభారంజనం ఎలా చేయగలనమ్మా?" అని తల్లి అమృతవల్లికి అంజలి ఘటించారు జగద్గురువు శంకర భగవత్పాదులు.

ఈ రోజుల్లో అవధానం చేస్తున్న అవధానులను చూస్తూవుంటే, కడుపారడి ఎలిగిన తల్లి సరస్వతి స్తన్యామృతాన్ని గ్రోలివుండకపోతే ఈ అవధాన ప్రక్రియ సాధ్యమా? అనిపించకమానదు మాబోంట్లకు.

శ్యామలానంద ప్రసాదుగారూ! మీరు కూడా ఆ కమల కోమలి శ్యామలాంబ సారస్వతామృత స్తన్యాన్ని ఒక గ్రుక్కెడు గ్రోలిన ధన్యజీవులు. అలా జగదంబ వరప్రసాదంగా అర్థవంతమైన మీ వాక్కును అక్షరం చేయటానికి మా "అర్థం" వినియోగించటం ఒక పరమార్థంగా భావిస్తున్నాం.

స్వభావ మధుర అయిన ఆ గీర్వాణి మీకు మధుర మంజుల వాగ్విలాసాన్ని ప్రసాదించాలనీ, అవధానాలతో సంస్కృతాంధ్ర వైభవాన్ని యశో విశాలం చేయాలనీ మనసా వాంఛిస్తూ మా చెవుటూరి ఛారిటీస్‌నుండి శుభాకాంక్షలు స్వీకరించమని కోరుతున్నాం.

శ్రీమాత సేవలో

**చెవుటూరు కుసుమకుమారి, తాండవకృష్ణ**

# చెవుటూరి ఛారిటీస్, విజయవాడ

శ్రీ చెవుటూరి తాండవకృష్ణ, శ్రీమతి కుసుమకుమారి దంపతులు, వీరి కుమారులు మురళీకృష్ణ, రామకృష్ణ సభ్యులుగా "చెవుటూరి ఛారిటీస్" అనే పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్టు 1986 సం॥లో స్థాపించబడింది.

బీద విద్యార్థుల విద్యాభ్యాసానికి తగు ఆర్థిక సహాయం, బీదవారికి వైద్య సదుపాయం, సాహిత్యాభిలాష, ఆధ్యాత్మిక చింతన పెంపొందించే గ్రంథాల ముద్రణకు ఆర్థిక సహాయం తన శక్తికొలది యీ ట్రస్టు చేస్తున్న కార్యక్రమాలు.

ఈ కార్యక్రమంలో భాగంగా ఇదివరలో యీ క్రింది గ్రంథాలను ముద్రించటం జరిగింది.

1. శ్రీ లలితా త్రిశతిభాష్యం (పునర్ముద్రణ)
   -శ్రీ గరికిపాటి కృష్ణమూర్తిగారు

2. శ్రీ దుర్గా ప్రతిపత్తి
   -డా॥ శ్రీ కుందుర్తి సత్యనారాయణగారు

3. తెలుగుసందేశ కావ్య సమాలోచనం
   -డా॥ బాపట్ల రాజగోపాలశర్మ

4. కవిత్రయ భారతంలో కమనీయ ఘట్టాలు
   -డా॥ జంధ్యాల మహతీశంకర్

5. నారాయణ కవచం
   -శ్రీమదాంధ్ర మహాభాగవతంనుంచి పునర్ముద్రణ.

• — •

# భద్రమస్తు!

ఆంధ్ర సాహితీ ప్రపంచంలో అవధాన ప్రభంజనం బాగా వీస్తున్నది. శతావధానులు, సహస్రావధానులు బయలుదేరి పద్యకవితా గగనాన్ని తేజశ్చకచ్చకితం చేస్తున్నారు. అవధానులకు ధారణ సరిగా లేదని, తప్పులు చెపుతున్నారని - ఇవి అసలు తిరుపతి వేంకటకవులవంటి పూర్వుల అవధానాలతో పోలిస్తే అవధానాలే కావని విమర్శలు జోరుగా సాగుతున్నవి. ప్రజలలో పత్రికలలో ఒక విషయాన్ని గురించి చర్చ బయలుదేరిందంటేనే దానికి కొంత ప్రాముఖ్యము వచ్చిందని, ఉన్నదని అర్థము. అవధానాల విషయమూ అంతే.

అవధానాలలో అన్ని పద్యాలు బాగుండకపోవచ్చు. వీలైనంతవరకు అర్థవంతంగా, దోషరహితంగా, వేగంగా చెప్పి ధారణ చేసి అప్పగిస్తే అవధాని కృతార్థుడైనట్లే. పద్యం అందంగానూ ఉండి కంఠమూ ఇంపుగా వుంటే ఆ వ్యక్తి సభలలో బాగా రాణిస్తాడు.

ఇటీవలి శతావధానుల పట్టికలో శ్రీ పాలపర్తి శ్యామలానందప్రసాద్ కూడా చేరారు. అందులో ఒక వైచిత్రి కూడా ప్రదర్శించారు. మామూలుగా శతావధానం మూడు రోజుల్లో చేస్తున్నారు. ఇటీవల రెండురోజుల్లో పూర్తి చేసిన సందర్భం కూడా నేను చూచాను. వీరు ఒక్కరోజులోనే చేశారని విని ఆశ్చర్యమూ, ఆనందము కలిగినవి.

శ్యామలానంద ప్రసాద్‌గారి అష్టావధానం నేను చూచాను. చాలా జాగ్రత్తగా ధారాధారణలతో నిర్దుష్టంగా చేశారు. ఈ ఏకదిన శతావధానం కూడా చూడాలి. విజయవాడ శతావధానం పద్యాలు చూచాను. పృచ్ఛకులు కూడా మంచి సమర్థులు. కొత్త కొత్త సమస్యలు అడిగారు. పూరణలు కూడా చాలా సామర్థ్య సమన్వితంగా కనిపించినవి. అవధానంలో ఇంత మంచి పద్యాలు రావటం చాలా అరుదు. కనుక అవధాన కవితా ప్రపంచంలో వీరికి చక్కని భవిష్యత్తు ఉంటుందని ఆశిస్తున్నాను. భద్రమస్తు!

డాక్టర్ ప్రసాదరాయ కులపతి

ప్రిన్సిపల్, హిందూ కాలేజి

శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు, గుంటూరు

# అవధాన సమీక్ష

సంచాలకులు :

'అవధాన సరస్వతి' కావూరి పూర్ణచంద్రరావు

అది స్వస్తిశ్రీ యువనామ సంవత్సర పుష్య శుద్ధ తదియ ఆదివారము. 1995వ సంవత్సరము డిసెంబరు 24వ తేదీ ఉదయము గం. 8-00 సమయము. స్థలము - విజయవాడ, సత్యనారాయణపురము "రైల్వేస్టేషన్" దగ్గర గల పవిత్ర శివరామకృష్ణ క్షేత్రము. ఆనంద స్వరూపిణియైన శ్యామలా దేవి-విజయవాటికా పౌరులకు ఒక యువశతావధానిని ప్రసాదింప సంకల్పించిన శుభవేళ.

ఇదియొక అపూర్వ సన్నివేశము. శతావధాని విజయవాడలో సయ్యద్ అప్పలస్వామి కళాశాలలో ఆంధ్రాధ్యాపకులుగా పనిచేయుచున్న డాక్టరు పాలపర్తి శ్యామలానందప్రసాదుగారు. ఇదివరలో వారనేక అష్టావధానములు, చతుర్గుణితాష్టావధానము పొనరించియున్నారు. శతావధానమునకిది వారి ప్రథమ ప్రయత్నము. ఇది ఏకదిన శతావధానము. నలుమూలలనుండి వచ్చిన పృచ్ఛకులు ముప్పదినల్గురు సభలో తమ తమ స్థానములనలంకరించి యున్నారు. వారిలో పండితులు, పండిత కవులు, అవధానులు, కళాశాలాధ్యాపకులు, కవులు, కవయిత్రులు. ఒక పృచ్ఛకుడు శ్రీ పింగళి వేంకట కృష్ణారావుగారు (శాతవాహన కళాశాల ఆంధ్రాధ్యాపకులు) అప్రస్తుత ప్రసంగము చేయుటకును మిగిలిన ముప్పదిముగ్గురు ఒక్కొక్కరు 3 ప్రశ్నల చొప్పున అనగా ఒక సమస్య (లేక దత్తపది) ఒక వర్ణన - ఒక ఆశువును అడుగుటకు నిర్ణయింపబడినది. మొత్తము పృచ్ఛకులు ($33 \times 3 = 99 + 1 = 100$) వేయు ప్రశ్నలు నూరు.

అశేష ప్రజానీకము - ఈ విశేష శతావధాన ప్రక్రియను తిలకించుటకు కుతూహలురై సభ నలంకరించియున్నారు. సభలో పాత్రికేయులు, సంస్కృతాంధ్ర పండితులు, విజయవాడలోని వివిధరంగాలలో ప్రశస్తికెక్కిన వారలనేకులున్నారు.

జాతీయ సమైక్యతా నినాదముపై ఏర్పాటు చేయబడిన ఈ సంస్కృతాంధ్ర శతావధానమును ప్రోత్సహించిన విజయవాడ విద్యాధరపురం-

"లయన్సు క్లబ్బు" డా॥ జి. వి. పూర్ణచంద్‌గారు మాట్లాడుచు విజయవాడ నగరములో డాక్టరు పాలపర్తి శ్యామలానందప్రసాదుగారివంటి యువ శతావధానులను వెలుగులోనికి తీసికొనిరావడం అనే ప్రధానోద్దేశంతో ఈ సభ నేర్పాటుచేశామన్నారు. వందమంది పృచ్ఛకులతో శతావధానము చేయించవలెనన్న వ్యయప్రయాసలతో కూడిన పని. తక్కువ వ్యయంతో శతావధానం చేయింపగల సదుపాయంతో వందమంది పృచ్ఛకులు బదులుగా 34గురు పృచ్ఛకులతోను, రెండు మూడు రోజులు సాగు శతావధానమును ఒక్క దినముననే పూర్తియగునట్లును ఈ ఏకదిన సంస్కృతాంధ్ర శతావధానం నిర్వహిస్తున్నారు.

ఎన్ని విక్షేపములు వచ్చినా, చలించకుండ, ఆయా విషయములందు మనస్సును ఏకాగ్రతగా నిలపడం, నిలిపినదానిని తిరిగి ధారణ చేయుట అవధాన శబ్దానికి అర్థంఅని చెప్పుదురు. పూర్వకాలంలో వేదపండితులు ఘన-జట అను వేదభాగాలను ముందునుండి వెనుకకు, వెనుకనుండి ముందు హేలగా వల్లెవేసేవారట. ఆ ఘనాపాఠీలు అలా వల్లెవేయడాన్ని అవధాన శక్తి అనేవారట.

ధారణతోపాటు, ఆశుకవిత, ఛందోఽలంకార వ్యాకరణ శాస్త్రాదులలో పాండిత్యము, నిషేధాక్షరి, వ్యస్తాక్షరి, సమస్యా పూరణము, దత్తపది, వర్ణన, ఘంటాగణనము, పుష్పగణనము, అప్రస్తుత ప్రసంగము, ఆకాశ పురాణము మొదలైన అనేకాంశాలను చేకూర్చుకొని ఏ ఇతర భాషలలోను లేని సంపూర్ణ అవధాన ప్రక్రియ ఆంధ్ర భాషలో రూపుదాల్చినది. ఎనిమిది అంశాలతో చేయు నవధానము అష్టావధానమనియు ఏకధాటిగా సమస్యలు గాని, వర్ణనలుగాని, దత్తపదులుగాని, ఆశువులుగాని 100 పద్యాలు చెప్పుట శతావధానమనియు నందురు. ఈ యంశములన్నియు నవధాని మేధాశక్తికి నికషోపలాలుగా రూపుదాల్చినవి. వీనినన్నింటిని సలక్షణముగా నిర్వహించుచు చమత్కార సంభాషణలతో ప్రేక్షకుల నలరించుచు నెగ్గుకొని వచ్చి, చివరలో తాను చెప్పిన పద్యాలనన్నింటినీ ధారణ చేయగలగడం అవధాని విజయాన్ని తెలియజేయును.

అనాటి యువావధాని డాక్టరు పాలపర్తి శ్యామలానందుగారు ఇన్నింటి లోను విజయము సాధించిరని చెప్పవచ్చు. ప్రథమ ప్రయత్నములోనే తన

ప్రతిభా పాటవాన్ని అవధానిగారు ప్రదర్శించిరి. 9 సంస్కృత శ్లోకాలు, 57 తెలుగు పద్యాలు, 33 ఆశువులు చెప్పి శతావధానము పూర్తిచేశారు. దుష్కర ప్రాసంతోను, సున్నితమైన భావాలతోను, అసంబద్ధములైన సమస్యలతోను యువావధానిని పృచ్ఛక మహాశయులందరు గట్టిగానే పరీక్షించిరి.

అవధానము వర్ణనాంశంతో ప్రారంభమైనది.

1. పృచ్ఛకుల ప్రశ్న - "భగవద్గీతలో శ్రీకృష్ణుడు మాసానాం మార్గశీర్షోఽహం" అన్నారు. ఆ మార్గశిర మాసాన్ని కంద పద్యంలో వర్ణించండి.

దీనికి అవధానిగారి పద్యం :

శ్రీకృష్ణరూపమై - నవ
శీకర సంతత తుషార సేచనయుతమై
శ్రీకర ఫల పుష్పములన్
మా - కళతో మార్గశీర్ష మాసము వచ్చెన్.

మంచు తుంపరలచే చల్లనైన వాతావరణముతో, ఫలపుష్పములతో మార్గశీర్ష మాసము శోభాయమానముగా లక్ష్మీకళతో ఉట్టిపడుచున్నది. అని చక్కగా వర్ణించిరి. ఇందులో చివరి పాదమును కవి గడుసుగా చెప్పారు. మా కళతో అనగా మాలాగానే అని తెలుగులో చెప్పుకోదగినట్లుగా చెప్పడమే ఆ గడుసుదనం. ఇది అవధాని ప్రజ్ఞను తెలియజేయును.

2. మరొక పృచ్ఛకుని ప్రశ్న - శివకేశవాద్వైతాన్ని వర్ణించండి. చంపకమాలలో చెప్పండి.

తిక్కన సోమయాజిగారి శ్లోకాన్ని తలపించుచు చెప్పిన పద్యం చూడండి.

శ్లోకం : కిమస్థిమాలా కిముకౌస్తుభం వా
పరిష్క్రియాయామ్ బహుమన్యసే, త్వమ్!
కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు! వద ప్రభో! మే!

పద్యము: గరళమొ! ఆ యశోద ఘనగణ్య మహామృతమైన స్తన్యమో!
వరతులసీదళంబొ! ప్రభవంబగు బిల్వమొ! శేషశయ్యయో!
అరుదగునా హిమాచలమొ! ఆత్మకు ప్రీతిని కూర్చు టెద్దియో!
హరిహరినాథ! తెల్పగలవా! శివరామ నవాలయంబులో

మచ్చునకు ఒక సమస్య కూడ వ్రాయుదును. సంచాలకుడనైనను నేను కూడ ఒక పృచ్ఛకుడనే!

3. నా సమస్య – కానికి కొనితెచ్చె వంద కమలా ఫలముల్.

ఈ సమస్య ఇచ్చినపుడు పృచ్ఛకులో ప్రేక్షకులో ఒకరు "కానీ" ఇప్పుడు చెలామణిలో వున్నదా? అని యడిగినారు. లేదు. ఉండవలసిన అవసరము కూడ లేదు. అది కూడ సమస్యలో ఒక భాగమే. సమస్యా పూరణములో నదియుండదు. చూడండి.

"కానీ"ల కాలమేగెను
కానిది కాలమ్ము వచ్చె కష్టము తెచ్చెన్
మానిత! తులమెత్తగు కన
కానికి కొనితెచ్చె వంద కమలా ఫలముల్.

"కానికి" అన్నది తులమెత్తయిన "కనకానికి" అయినది.

4. మరియొక పృచ్ఛకుని ప్రశ్న – విశ్వనాథ కవితా వైశిష్ట్యాన్ని వర్ణించండి.

విశ్వనాథ తన గొప్పదనాన్ని చాటుకొనుచు "అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగమస్మాదృశుండ లఘుస్వాదు రసావతార ధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడనాడయిన్నట్టిది" అని చెప్పు కొన్నాడు. వీరు ఆ పద్యాన్ని అందిపుచ్చుకొని, అందులో లేని దుష్కర పాసను కల్పించుకొని-

యద్భోగం బొగి నన్నయాదులకు లభ్యంబై విడంబింపదో!
తద్భోగంబును చెళ్లపిళ్ల కులపద్మ స్వామికిం గూర్చి దీ
ద్యద్భావాఫగ నాంధ్రపుంబొలములం బండించె నే పుంవపు
ష్మద్భాషావధువాతనిం గొలుతు శ్రీమద్విశ్వనాథాన్వయున్
అని రమ్యాతి రమ్యముగ పద్యము చెప్పారు.

ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో, పృచ్ఛక మహాశయుల ప్రశంసా వాక్యములతో, కార్యకర్తల, వదాన్యుల సన్మాన విశేషాలతో ఆద్యంతము ఉత్కంఠభరితముగా సర్వజనాహ్లాదకరంబుగా సాగిన ఈ యవధాన కార్యక్రమము ఆనాటి రాత్రి గం. 9-00లకు విజయవంతముగా పూర్తిఅయినది.

మున్ముందు శతావధాని డాక్టరు పాలపర్తి శ్యామలానంద ప్రసాదుగారు కనకాదుర్గాదేవి కరుణా కటాక్ష వీక్షణములచే అనేక శతావధానాష్టావధానములను దిగ్విజయంబుగా పొనర్చి ఆంధ్ర సరస్వతీ వైభవమును దిగంతముల వరకు వ్యాపింపజేయుదురని ఆకాక్షించుచున్నాను.

వయసులో పెద్దవాడనగుటచే నేను చెప్పవలసినవి ఇంక మూడు మాటలు మాత్రమే గలవు.

"శతావధానీ! శ్యామలానంద ప్రసాదూ! శతాయుష్మాన్భవ"



# అవధానిని గురించి...

సమన్వయకర్త : డాక్టర్ వి. వి. భానుమూర్తి
ఎం.ఏ, పిహెచ్.డి.,

హేవిళంబి నామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి గురువారం (3-10-1957) విజయదశమినాడు గుంటూరుజిల్లా పొన్నూరులో 'శతావధాని', 'అభినవ జయదేవ' బిరుదాంకితులు బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్య శాస్త్రిగారికి దౌహిత్రుడు ఉద్భవించాడు. అతడే శ్యామలానంద ప్రసాద్.

పాలపర్తి వంశం, కాశ్యపస గోత్రం, పూర్ణాంబా వేంకట సుబ్బారావు పుణ్యదంపతుల ద్వితీయ పుత్రసంతానమే శ్రీ శ్యామలానంద ప్రసాద్. వీరి శ్రీమతి భానుమతి. సంస్కృతాంధ్రాలు చక్కగా చదువుకొన్న భాషాప్రవీణ. చిరంజీవినులు విశ్వనాథభారతి, వేదవాహిని, భ్రమరవాసిని, ఆముక్తమాల్యద వీరి సంతానం.

ప్రాథమికోన్నత విద్యాభ్యాసంవరకు కృష్ణాజిల్లా అవనిగడ్డలోను, భాషా ప్రవీణ గుంటూరు జిల్లాలోని పొన్నూరులోగల శ్రీ భావనారాయణస్వామి సంస్కృతకళాశాలలోను అభ్యసించిన డా॥ శ్యామలానందప్రసాద్ భాషాప్రవీణ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడగుటయే కాక యూనివర్శిటీలోనే సర్వప్రథముడుగా వచ్చిన అసమాన ప్రతిభాశాలి. పిమ్మట స్వయంకృషితో ఎం.ఏ., (తెలుగు), ఎం.ఏ, (సంస్కృతం) చదివి, అంతటితో తృప్తిచెందక "శ్రీ చల్లా పిచ్చయ్య శాస్త్రిగారి సాహిత్యప్రకాశం" మీద విశేష పరిశోధన గావించి నాగార్జున విశ్వవిద్యాలయంనుండి డాక్టరేట్ పొందారు. విద్యా వినయసంపన్నులైన వీరు ప్రస్తుతం విశ్వనాథవారి సంస్కృత నాటకాలపై పరిశోధన చేసి తిరుపతి లోని 'రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం' నుండి సంస్కృతంలో డాక్టరేట్ స్వీకరించనున్నారు.

ఛందస్సు అంటే ఏమిటో ఎరుగని చిన్నతనంలో, ఎనిమిదవ తరగతి చదువుతూన్న రోజుల్లో 'ఆటోరైటింగ్' ప్రక్రియద్వారా అప్రయత్నంగా ఆటవెలది పద్యం ఆయననుండి వెలువడింది. అదే ఆయన కవితారచనకు శ్రీకారం.

"శ్రీ సతతము నిజము శిష్యుడ వినుముర
నేను నెల్లవేళ నీకు తోడు........"

అంటూ ఛందోరీతిలో సాగిన వారి పద్యాలు ఆనాటి 'ఆటోరైటింగ్'పత్రికలో చోటు చేసుకున్నాయంటే ఆశ్చర్యం కలుగక మానదు. డా॥ శ్యామలానంద ప్రసాద్ తమ పితృపాదులు ఉద్దండ కవి పండితులైన బ్రహ్మశ్రీ వేంకట సుబ్బారావుగారి వద్ద ఛందోలంకారాది శాస్త్రాభ్యాసం గావించారు. అంతేకాదు, తాను అవనిగడ్డలో చదువుతూన్న రోజుల్లో గురువర్యులు శ్రీ జోశ్యుల సూర్య నారాయణమూర్తిగారి ప్రోత్సాహంతో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి గ్రంథాలను పఠించి సాహిత్యాభిరుచిని మరింత పెంపొందించుకున్నారు. విశ్వనాథవారి మీద గల అభిమానంతో బందరు హిందూ హైస్కూలులో ఒకానొక సభలో ఉపన్యాస మిస్తున్న వారిని దర్శించి జన్మ సార్థకమైనట్లు భావించారు.

1972లో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి సంపాదకత్వంలో 'నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా' వారు ప్రచురించిన సంకలనంలో పదునాలుగేండ్ల ప్రాయము గల ఈ బాలకవి పద్యాలు కూడా 'ఆదికవి ఆవేదన' అనే శీర్షికతో ప్రచురింపబడ్డాయి. పిదప విశ్వనాథవారి శిష్యత్వంలో కవిత్వాభ్యాసాన్ని ద్విగుణీకృతం చేసుకొని ధర్మసూక్తం, శతవిఘ్నేశ్వరీయం, జైన ధర్మశతకం, పద్మవంశి, శ్రీకృష్ణోదాహరణం వంటి అనేక కావ్యాలు రచించారు.

వివిధ వేదికలపై వీరు సాహిత్య ధార్మికోపన్యాసాలు ఇవ్వడమే కాకుండా, వీరి వివిధ రచనలు పలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణిలో ప్రసారమైనాయి. ఇంకా మరెన్నో రచనలు వెలుగు చూడ టానికి సిద్ధంగా వున్నాయి.

అవధాన విషయానికి వస్తే డాక్టర్ శ్యామలానంద ప్రసాద్‌గారు పొన్నూరులోని శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కళాశాలలో భాషాప్రవీణ చదువుతూన్న రోజుల్లో డాక్టర్ సూరం శ్రీనివాసులుగారివద్ద అష్టావధానంలోని మెలకువలు గ్రహించారు. అక్కడే గురువుల సమక్షంలో 1977లో మొట్ట మొదటి అష్టావధానంచేసి వారి ఆశీస్సులతోపాటు ప్రశంసలు కూడా పొందారు.

అటుపిమ్మట రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో శతాధిక అష్టావధానాలు, ద్విగుణిత, చతుర్గుణిత అష్టావధానాలు చేసి బహుబిరుదముల నందుకొన్నారు.

శ్రీ గణపతి సచ్చిదానందస్వామి, శ్రీ కుర్తాళం పీఠాధిపతి, శ్రీ పుష్పగిరి పీఠాధిపతి, శ్రీ విశ్వయోగి విశ్వంజీ వంటి ప్రసిద్ధ పీఠాధిపతుల సమక్షంలోనూ, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, డా॥ ప్రసాదరాయ కులపతి, ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, శ్రీ పేరాల భరతశర్మవంటి దిగ్దంతులైన కవిపండితుల సమక్షంలోనూ అనేక అవధానాలు చేసి వారి దివ్యాశీస్సుల నందుకున్నారు.

లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ విద్యాధరవారి ప్రోత్సాహంతో ఉద్దండులైన కవిపండితుల సమక్షంలో సాహిత్య రాజధానిగా వేనోళ్ళ కొనియాడబడుతూన్న విజయవాడ సత్యనారాయణపురం శ్రీ శివరామకృష్ణ క్షేత్రంలో ప్రప్రథమ ఏకదిన సంపూర్ణ శతావధానం 24-12-1995న విజయవంతంగాచేసి ఆబాలగోపాలం మన్ననలు అందుకొన్న అవధాని శిఖామణి డా॥ శ్యామలానంద ప్రసాద్‌గారు.

వారు ఇంతటితో సంతృప్తి చెందక సహస్రావధానానికి ఉద్యమించాలనీ, అందుకు తగిన శక్తియుక్తులు ఆయురారోగ్య భాగ్యాలు భగవంతుడు వారికి సదా ప్రసాదించాలనీ ప్రార్థిస్తున్నాను.

ఈ అవధాన నిర్వహణకు ఆర్థిక సహాయాన్ని సహృదయంతో, సాహిత్యాభిమానంతో అందజేసిన వదాన్యులందరికి నా కృతజ్ఞతలు.

ఆ విధంగానే లయన్స్ క్లబ్ విద్యాధరపురం సభ్యులు ఈ భారాన్ని పంచుకున్నందులకు ధన్యవాదములు.



# కృతజ్ఞతావధానము

కళల కాణాచియైన విజయవాడ నగరంలో ఏకదిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం చేసే అవకాశం లభించటం నా అదృష్టం. అమ్మ కరుణ అపారం. ఆ శ్రీమాత ఎన్నోరూపాలు ధరించి ఈ కార్యాన్ని గట్టెక్కించింది. ఆమెకు—?

సారథ్య సంఘాధ్యక్షులు వాణీనికేతన్ డైరెక్టర్ శ్రీ కోనేరు రామచంద్రరావు, సభ్యులు శ్రీయుతులు బాలాజీస్వామి, మండలి బుద్ధప్రసాద్, బెజవాడ రామశేషయ్య, చిగురుపాటి వరప్రసాద్, టి. దుర్గామల్లేశ్వరరావు, డి. యల్. నారాయణ, సి. వి. యస్. రామకృష్ణ, బోయిపాటి శ్రీరాములు, వి. జి. యస్. పబ్లిషర్స్, టి. కె. ఎల్. ఎన్. ఆచార్యులు, ఓరుగంటి ఆంజనేయశర్మ, బుఱ్ఱా శివరామకృష్ణశర్మ, బుఱ్ఱా రాధాకృష్ణమూర్తి, దేవినేని కిషోర్, మనికొండ శంకరనారాయణ, క్రోవి పార్థసారథి, గ్రంధినాగేంద్రరావు, కె. విజయకుమార్ గారలకు నా కృతజ్ఞతలు.

లయన్స్ క్లబ్ ఆఫ్ విద్యాధర అధ్యక్షులు మిత్రులు డా॥ జి. వి. పూర్ణచంద్, శ్రీరామా విద్యాలయం అధినేత శ్రీ బుఱ్ఱా బాలకృష్ణశర్మ, ప్రముఖ పండితులు, మిత్రులు డా॥ వి. వి. భానుమూర్తిగారలను కృతజ్ఞతల నుండి మినహాయిస్తున్నాను ఎన్ని చెప్పినా చాలవు కనుక-

పృచ్ఛకులుగా విచ్చేసిన కవి పండితవర్యులకు నా కృతజ్ఞతలు.

ఆర్థిక, హార్దిక సహకారాలను అందించిన వారికీ, ఆప్యాయతతో సమ్మానించిన వారికీ నా కృతజ్ఞతలు.

అవధానాంతంలో ఆశీస్సులందించిన విశాలాంధ్ర సంపాదకులు శ్రీ సి. రాఘవాచారి, శ్రీ కె.జి.సి. హరివిఠల్ మొ॥ పెద్దలకు నా ధన్యవాదములు.

వాత్సల్యంతో అవధాన పద్యాలను అచ్చువేయిస్తున్న "చెవుటూరి ఛారిటీస్" పెద్దలు శ్రీ తాండవకృష్ణగారికి, శ్రీమతి కుసుమకుమారిగారికి కృతజ్ఞతాంజలి.

అందంగా ముద్రించిన 'శ్రీ గాయత్రీ ప్రెస్' వారికి అభినందనలు.

—శ్యామలానంద ప్రసాద్



  

# ఏకదిన సంపూర్ణ
# సంస్కృతాంధ్ర శతావధానం

**24 - 12 - 1995**

వేదిక :

## శివరామకృష్ణక్షేత్రం
విజయవాడ

  



# ఇష్టదేవతా ప్రార్థన

శ్రీ లక్ష్మీగణపతి వను
పాలింపుము నాగుమాలి వరవరద వినున్
పోలెడు వేలుపు లెవ్వరు
మూలాధారాంతరస్థ! మోహిత జగతీ!

లక్ష్మీయుక్తుని నిన్నునున్ గణపతిన్ లంబోదరాంతః కృపున్
లక్ష్మీభూత సితాబ్జకోరక కళోల్లాసైకదంతప్రభున్
పక్ష్మశ్రీ నిభృతోద్వమత్ మృదుదయాపాథస్తరంగాక్షు, మో
క్షక్ష్మాలాభసభావశీకృతిగతేచ్ఛున్ గొల్తు విఘ్నేశ్వరా!

అశ్వగ్రీవుని తలచెద
శశ్వద్విద్యాప్రదాయి స్ఫటికమణి-నిభున్
విశ్వహిత సార సాహితి
శాశ్వతమౌ యశము నొసగి సంరక్షింపన్

శ్రీకృష్ణా ఝరిణీ తరంగజ పృషత్ శ్లిష్టానిలోద్ధూత పా
పాకూతుల్ భవదీయ పాదయుగ సేవారక్తులౌ భక్తులన్
నీ కారుణ్య విలోకనమ్ముల జడిన్ నిర్నిద్రతన్ బ్రోచు త
ల్లీ! కాపాడవె! వాగ్విలాస సురవల్లీ మల్లి! దుర్గాంబికా!

నతజనత కాత్మతుల్య ఘ
నత నిచ్చు మహానుభావు నతిశతయుతిచే
నుతియింతు సీవివీగురు
శతావధాన విజయాప్తి సౌఖ్యము పొంటెన్

మాతాపితృ వందనం :

పూర్ణాంబా సుబ్బరాయాఖ్యౌ
మత్పితరౌ భజే హృది
యయోః కారుణ్యమాత్రేణ
స్థాతుమస్మి విదాం పురః

అవధాన గురువందనం :

సూరం కుల రత్నాలం
· కారుని శ్రీ శ్రీనివాస కవిరవి గొలుతున్
కూరిమి నను సద్గురుడయి
తీరిచి దిద్దుట వధాన దీవ్యత్ఫణితిన్

పృచ్ఛక వందనం :

పృచ్ఛకవర్యులార! రసరీతి గుణాంచిత చిత్తులార! వి
ద్వచ్ఛకటీ కృతాకృతి విభాసితులార! శతావధానమే
కృచ్ఛ్రిము కాగ, ఏకదినరీతియు నూతనమౌటచేత మీ
స్వచ్ఛ కృపానుభావమును ప్రార్థనచేసి నమస్కరించెదన్

ఏకదిన క్రియమాణం
శతావధానం చలతి హి విద్వాంసః
కృపయా స_న్త్వితి యాచే
దుష్టే లింగక్రియాది సందర్భే

శ్రోతృ వందనం :

ఏ కృష్ణ యొడ్డున నీరేడులోకాలు
కాపాడు కనకదుర్గమ్మ వెలసె
ఏ కృష్ణ యొడ్డున శ్రీకాకుళమ్మున
తొలి యాంధ్ర సామ్రాజ్యకలన మెరసె
ఏ కృష్ణ యొడ్డున నృత్యగానానూ-న
సాహిత్య సంపదల్ జాలువారె
ఏ కృష్ణ యొడ్డున నిడె కల్పకమునీడ
జ్ఞానపీఠమ్ము విజ్ఞానభిక్ష
అట్టి కృష్ణానదీజల మారగ్రోలి
ప్రాజ్ఞతను గన్న బెజవాడ పౌరులార!
ఎల్లరకు మ్రొక్కి శతవధానోల్లసనము
మొదలువెట్టెద దీవించి పొందు తుదకు

# వర్ణనలు

1. శ్రీమతి డా॥ కె. గిరిజాలక్ష్మి, మునిసిపల్ ఓరియంటల్ కళాశాల, విజయవాడ
మార్గశీర్షమాస వైశిష్ట్యం :

శ్రీకృష్ణ రూపమై నవ
శీకర సంతత తుషారసేచనయుతమై
శ్రీకర ఫలపుష్పములన్
మాకళతో మార్గశీర్ష మాసము వచ్చెన్.

2. శ్రీమతి టి. కె. చూడామణి (సంస్కృతం)
రైల్వే మిక్స్‌డ్ హైస్కూలు, విజయవాడ
గోదాదేవి వర్ణన :

ఆముక్త మపి మాల్యం తత్
ప్రీతేన స్వామినా ధృతమ్
తస్మాద్రాజతి కల్యాణీ
సాఖ్యయాముక్తమాల్యదా

3. శ్రీమతి కె. రమాదేవి, సిద్ధార్థ పబ్లిక్ స్కూలు, విజయవాడ
శివరామకృష్ణ క్షేత్రంలోని శివకేశవాద్వైతాన్ని గూర్చి-

గరళమొ? ఆ యశోద స్తనగణ్యమహామృతమైన స్తన్యమో?
వరతులసీదళంబొ? ప్రభవంబగు బిల్వమొ? శేషశయ్యయో?
అరుదగు నా హిమాచలమొ? ఆత్మకు ప్రీతిని కూర్చుటెద్దియో?
హరి హరినాథ! తెల్పగలవా? శివరామనవాలయంబులన్

4. శ్రీమతి పి. భానుమతి, విశ్వశాంతి విద్యావిహార్, పోలకంపాడు
సాయంసంధ్యాకాల వర్ణన - చంపకమాల

ఘనమగు బార్లుగా ఖగనికాయము గూళ్లకు చేరసాగెఁదా
వనజహితుండు గ్రుంకెనట పశ్చిమపర్వతప్రాంతసీమలో
తొణకెడుకుండయౌ పొదుగుతో తన లేగను జేరె గోవు, నీ
యనువున సాంధ్యకాలమున నందములెన్నియొ తోచు చూచినన్

5. శ్రీ కావూరి పూర్ణచంద్రరావు,
ఆంధ్ర లయోల కళాశాల (రిటైర్డు), విజయవాడ
కుంభకోణాలను గూర్చి - చంపకమాల

జనములె రాజులైన తరి సర్వము సాగెను కుంభకోణమై
కనబడుదానినెల్ల కడకన్ దిగమ్రింగెడు కుంభకర్ణులై
మునువెను జూడనట్టి కడుమూర్ఖులు నేతలు పీఠమెక్కుచో
ఘనకవితా విలాస రసకంధర! పెక్కులు కుంభకోణముల్

6. శ్రీ మల్లాది సుబ్రహ్మణ్యశర్మ (సంస్కృతం)
శాతవాహన కళాశాల (రిటైర్డు), విజయవాడ
ఆడుపిల్లల తండ్రి మనోవేదన :

శ్రీరేవ జాతా మమ పూర్వపుణ్యైః
తాం పోషయిత్వా సకలం దదామి
ఇత్యేవ భ్రాంతః ఖలు తాతపాదః
శ్రాంతో విరాతీహ వరప్రదానే

7. డా॥ చివుకుల సుందరరామశర్మ, కె. బి. యన్. కళాశాల, విజయవాడ
విశ్వనాథవారి సాహితీ విశిష్టత :

యద్భోగంబొగి నన్నయాదులకు లభ్యంబై విడంబింపదో
తద్భోగంబును చెళ్లపిళ్ల కుల పద్మస్వామికిం గూర్చి దీ
వ్య ద్భావాపగ నాంధ్రపుంబొలములన్ బండించె నేపుంవపు
ష్మద్భాషావధువాతనిం గొలుతు శ్రీమద్విశ్వనాథాన్వయున్

8. డా॥ జంధ్యాల మహతీశంకర్, శాతవాహన కళాశాల, విజయవాడ
భగీరథుడు - భగవాన్ శ్రీ సత్యసాయి తులనాత్మక వర్ణన :

తత్త్రైతామహపుణ్యలోకగమనార్థంబైన స్వార్థంబుతో
మత్త్వాధస్స్థల నా భగీరథుడు ప్రేమందెచ్చె నిద్ధాత్రికిన్
మత్పుత్రుల్ జనులెల్ల దాహకలనన్ గ్రమ్మందంగ నౌనెట్లు చం
చత్పాతాళజలంబుఁ దెత్తుననియెన్ సాయీశుడున్ చెచ్చెరన్

9. డా॥ కుందుర్తి సత్యనారాయణమూర్తి
ప్రధానార్చకులు, కనకదుర్గ దేవస్థానం.
మహిళా గౌరవం – కృతయుగం నుండి నేటివరకు :

ఝరియయి సాగు సంసృతియు సంస్కృతియున్ రమణీయమేకదా
తరుణుల గారవించియ కదా! కథలెల్లను సాగె వేదమం
దరయ పురాణ వర్గమున నట్టి ధరాస్థలి నాడువారికిన్
కరవగునేని గారవము కానగ నెచ్చట వచ్చు ధారణిన్

10. డా॥ ముళ్ళపూడి జయసీతారామశాస్త్రి (సంస్కృతం)
వి.కె.ఆర్. కళాశాల, గన్నవరం.
ఆదికవి వాల్మీకి కవితా మాధుర్యం :

అమృతం నాస్తి భూలోకే, అస్తి రామాయణీ సుధా
తత్సౌపర్ణమహం వందే, వాల్మీకిం కవినాయకమ్

11. శ్రీ మెట్టా వెంకటేశ్వరరావు,
ఆంధ్ర లయోలా కళాశాల (రిటైర్డు), విజయవాడ
ఉద్యోగాన్వేషణలో అలసిపోయిన ప్రతిభావంతుని
మనోవేదన – వృత్తంలో

టక్కరిలోకమియ్యది కటా! యెటు చూచిన మోసమై చనెన్
అక్కజమైన నా ప్రతిభ యంతయు వ్యర్థముగాఁదనర్చె నిం
కెక్కడ పోవగావలయు నెవ్వరి వేడుదు మాతృదేశమే
చిక్కులు కూర్చుచుండెనని చింతపడున్ ప్రతిభా విలాసియున్

12. డా॥ కె. కె. విశ్వేశ్వరశాస్త్రి, కె. బి. యన్. కళాశాల, విజయవాడ.
విషయము : ఈశ్వరుణ్ణి లింగరూపంలో ఆరాధించటంలో
ఆంతర్యం – చంపకమాల

రవ రవలేని భక్తిని శరత్వము వీడిన భక్తకోటినిన్
శివశివ ఆదియంతములు చేటును బాటును లేనివాడవై
ప్రవిమల వత్సలత్వమున భవ్యత లీనము చేసికొందు వా
స్తవమును లింగరూపతనుధారణ కొల్చెద నీలకంధరా!

13. శ్రీ ఎ. వి. సుబ్బారావు, శాతవాహన కళాశాల, విజయవాడ.
విషయము : గీత, ఖురాను, బైబిలు సారాంశము - ఉత్పలమాల

డంబము లేని భక్తియు విడంబన లేని ప్రవర్తనల్ నిరా
లంబులసేవనంబున నిలాతల మెల్లెడ బ్రోచుటల్ నిరా
డంబరమైన జీవనమిటన్ వచియించును సర్వగ్రంథముల్
పంబిన శ్రద్ధ బైబిలును భవ్యఖురానును దివ్యగీతయున్

14. శ్రీ వి. వి. సుబ్బారావు, యస్. ఎ. యస్. కాలేజి, విజయవాడ.
విషయము : లక్ష్మిపార్వతి కొప్పు — ఎన్టీఆర్‌కు ముప్పు.

ఆటవెలది కొలది ఆ రాజ్యలక్ష్మియు
వచ్చిపోవుచుండు వరుసలోన
ఆమె కొప్పులోన అతని ముప్పే లేదు
వివి సుబ్బరాయ! విబుధ గేయ!

15. డాక్టర్ వై. నరసింహారావు, యస్.ఎ.యస్. కాలేజి, విజయవాడ.
విషయము : ధనుర్మాస వైశిష్ట్యము — ఉత్పలమాల.

నాలుగు వేదముల్ గలసి నవ్యత చూపెడి పాశురంబులన్
శ్రీ లలనాస్వరూపయయి చెన్నలరారెడు గోద పాడగా
హేలగ రంగవల్లికల నెల్లెడ తీరిచి రంగనాథు పా
దాలకు సౌధముద్రలను దార్చెడు ఈ ధనువున్నుతించెదన్

16. శ్రీ వై. సోమసుందరరావు, యస్.ఎ.యస్. కాలేజి, విజయవాడ.
విషయము : ధీర సమీరే—యమునాతీరే—వసతివనే—వనమాలీ
దీనిని తెలుగు పదాలుగా గ్రహించి అమ్మవారి స్తుతి

'ధీరసమీరే' పితరుల్
ఆరయుమిముదూరునవిన 'యమునాతీరే'?
గౌరి!వరశి'వసతి వ,నే'
నారితివడ శ్రితుల య'వనమాలి'కినసదే

ధీరసము+ఈరే, అవినయము, వా, తీరే, శివసతివ, నే, అవనము+అలిక

17. శ్రీ జంధ్యాల పరదేశిబాబు, శాతవాహన కళాశాల, విజయవాడ.
విషయము : విజయవాడ ప్రాశస్త్యము

ఆదికాలమునుండి అన్నింట మిన్నయై
విలసిల్లు బెజవాడ కళల ప్రోడ
కనకదుర్గాపాదమణితులాకోటియై
విలసిల్లు బెజవాడ కళల ప్రోడ
దమ్మున్నవారు డెందమ్మున్నవారితో
విలసిల్లు బెజవాడ కళల ప్రోడ
బ్రాహ్మ్యంబు క్షాత్రంబు పడుగు పేకలుగాగ
విలసిల్లు బెజవాడ కళల ప్రోడ

అట్టి బెజవాడనున్నట్టి ప్రాజ్ఞులైన
సభ్యవర్యుల యెదుట నే చాపలమున
శతవధానంబు సలుపగా సాహసింతు
నన్ను మన్నించి ప్రోత్సహనంబు నిడుడు

18. శ్రీ డి. ఆర్. చక్రవర్తి, జ్యోతి కళాశాల, విజయవాడ.
విషయము : మంగళగిరి నరసింహస్వామి పానకసేవన వైభవము

ప్రక్కవారికిడిన పానకమ్మును కూడ
త్రాగు స్వార్థపరత ధాత్రినుండ
పిచ్చి స్వామి తనకు నిచ్చినదానిలో
సగము తిరిగియిచ్చు సజ్జనుండు

19. శ్రీ కె. పార్థసారథి, శాతవాహన కళాశాల, విజయవాడ.
విషయము : నరసింహావతారమును ప్రధాని పి. వి. నరసింహారావు
లను పోల్చుచు—

ధరణి దాగిన దానవ దౌష్ట్యమెల్ల
కూల్ప నరసింహరూపంబు గొనియె హరియు
తాను దారిద్ర్యరక్షోవిదారణమున
నవ్య నరసింహరూపుడై నాడు పి.వి.

20. శ్రీ యం. వివేకానంద, శాతవాహన కళాశాల, విజయవాడ.
విషయము : హిందూ ముస్లిం క్రైస్తవాది మతాలవారు సభ్యులుగా
ఉన్న ఒక కుటుంబ వర్ణన.

నడుమన్ వచ్చె మతంబులన్నియును సంధానించి చూడంగ యె
న్నడు సౌస్థిర్యము గాంచు మానవతయే నానా ప్రకారంబులన్
నుడువన్వచ్చు మత ప్రవర్తకులు నందుంజూడ సత్యంబు నొ
క్కడుగా బుద్ధినెఱుంగు సభ్యులకిదే గావించెదన్ మ్రొక్కులన్

21. శ్రీ పైడిపాటి ఉమానాథ శర్మ, శారదా కాలేజి, విజయవాడ.
విషయము : ప్రపంచమంతటికి భారతదేశము నాయకత్వము
వహించుననను జోస్యమును గూర్చి

భరతావని శీర్షంబై
ధరణి న్నడిపించుననుచు తానసె నెవడో
అరయనదియె సత్యంబై
వరలినచో నంతకన్న భాగ్యము గలదే!

22 శ్రీ రాళ్ళబండి నాగభూషణశాస్త్రి, జైన్ హైస్కూలు, విజయవాడ.
విషయము : అవధానము చేయుటలో ఉన్న చిదంబర రహస్య వర్ణన

ఫలములున్న చెట్టు పద్యంబు; ఎన్నెన్ని
రాళ్లు పడిన అన్ని పళ్ళనిచ్చు
అంతకంటె నే రహస్యంబు లేదయ్య
ఈ చిదంబరమున నీద్యసుకవి!

23. శ్రీ బుఱ్ఱా భాస్కరశర్మ, శ్రీ రామ విద్యాలయం, విజయవాడ.
విషయము : ధనవ్యామోహ మధికముగాగల నేటి వైద్యుల గురించి
ధన్వంతరి భావన:

భవ్యంబైన సదాశయంబుననను సద్వైద్యుండు రోగార్తులన్
సవ్యంబైన నిదానపద్ధతుల రక్షంగూర్ప క్షీరాబ్ధిలో
నవ్యంబై జనియించె శాస్త్రమిది అన్నా! నేటి వైద్యాళి, వి
త్తవ్యామోహము సుంతవీడఁదగదా? దాక్షిణ్య మేపారగన్

24. శ్రీ జె. శ్రీనివాస చక్రవర్తి, యశస్వీ విద్యాలయం, విజయవాడ.
విషయము : క్లాసులు ఎగగొట్టి సినిమాలకు పోయే విద్యార్థుల తల్లిదండ్రుల భావాలు:

బోటనీ పాఠమేటికి మ్యాటనీకి
పోదమన్నట్టి విద్యార్థి బుద్ధిఁజూచి
వాడి కన్నీరు పెట్టదో; వానిగన్న
తల్లిదండ్రుల యెదఁదలు తల్లడిలవా?

25. శ్రీ బి. యస్. ఆర్. మూర్తి, శాతవాహన కళాశాల, విజయవాడ.
విషయము : అవధానము చేయుటలో ఏమైనా వైష్ణవమాయ ఉన్నదేమో వర్ణించండి :

విష్ణుమయంబుగా జగము విస్ఫురణంబున నుండెనంచు తా
విష్ణు సహస్రనామముల పేర్కొనె, సర్వకళామయుండుగా
జిష్ణుని పోతనార్యుడును చేకొనె కాన వధానరీతిలో
చిష్ణువు కూడ విష్ణువని చెప్పిన నయ్యది వాని మాయయే

26. శ్రీ లంకా లక్ష్మీనరసింహాశర్మగారు,
ప్రిన్సిపాల్, ఓరియంటల్ కళాశాల, నరసరావుపేట.
విషయము : హైదరాబాదు ట్యాంక్‌బండ్‌మీద వున్న విగ్రహాలకు ప్రాణం వస్తే ఏమి చేస్తాయి.

మానని గాయముల్ సలిపి మమ్ముల తీర్చిరి శిల్పివర్యులున్
దానికి చింతచెందము కదా! యిక ప్రాణము తెచ్చిరేని బా
రా! నవదుష్టమార్గముల రాజిలు ముక్కిడి రాజకీయముల్
కానగలేక దూకెదముగా వెనువెంబడి ట్యాంకుబండునన్

27. డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి,
యస్. కె. బి. ఆర్. కాలేజి, నరసరావుపేట.
విషయము:ఎయిడెడ్ ఉపాధ్యాయులకు ప్రభుత్వంఇచ్చే గ్రాంటును
నిలుపుదల చేస్తుందేమోననే భయాన్ని గూర్చి-

రాని భయంబు గూర్చి యిటు ప్రాణము దీసికొనంగనేల ఆ
నానుడి యున్నదే నుత్తగుణా! బడిపంతులు గూర్చి, యెట్టులో
ప్రాణము నిల్పుకోగలము భవ్యులు ఛాత్రులు వారి పెద్దలెం
తేనియు గారవంబున నెదేని యొసంగరె దేశికాళికిన్

28. శ్రీమాన్ వేదాల రాజగోపాలాచార్యులు, నరసరావుపేట.
విషయము : కర్ణుడు లేని భారతాన్ని నేటి భారతంతో పోలుస్తూ—
శార్దూల విక్రీడితం.

లావాక్కింతయు లేని కర్ణునకు స్వావలంబంబు చేకూర్చి ధా
త్రీవాల్లభ్యము నిచ్చె రాసుతుడు, ఎంతేభక్తితో నాతడున్
సేవించెన్ గడదాక, అట్టి జనులిప్పి! నేటి కాలాన లే
రా విద్యాధిప! కాన భారతకథావ్యాహారమున్ మారెడున్

29. శ్రీ చల్లా లక్ష్మీనారాయణ, వి.సి.హెచ్. స్కూలు, విజయవాడ.
విషయము : సంస్కృత భాషవలన అన్యభాషలు నష్టపోవుచున్నవా?
మాతృస్తన్యేన కో౽భ్రష్టః, పుష్టఏవ సదా భవేత్
గీర్వాణ భాషయా సర్వాః, బాషా వర్ధంత ఇత్యలమ్.

30. డా॥ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి, విజయవాడ.
విషయము : 'ర్గ' ప్రాసతో సంస్కృతంలో శార్దూలములో కనకదుర్గా
దేవి ప్రార్థన.

స్వర్గప్రాభవ భవ్యబీజనగరే రమ్యేంద్ర కీలాచలే
భర్గార్థాంగ విభూషితా, శ్రితజన స్వారాజ్యవృక్షాకృతిః
దుర్గస్తోమనివారణప్రవణతాధుర్వత్వసంవర్ధినీ
దుర్గా సర్వజగత్ప్రసూర్విజయతే తాం నౌమి భక్తావనామ్

31. శ్రీ వంగల రామమూర్తి, నరసరావుపేట.
విషయము : చలి బాధ వర్ణన :

బలవంతమైన శీతువు
చెలియో పచ్చడమొ కుమ్ము సెగయో లేకన్
వెలలింపదరమె పాంధుల
గళబంధముగాగ వచ్చె కావవె చలిరో!

32. డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి, యస్.కె.బి.అర్. కాలేజి, నరసరావుపేట.
విషయము : కాశ్మీర్‌ను పాకిస్తాన్ ఆక్రమించినపుడు పటేల్ గుండెల్లో చెలరేగిన భావాలు - పంచచామరము.

ప్రపంచమెల్ల విస్తుపోయి పాకు తూలనాడగా
త్రపావిహీనమైన రీతి తాను భారతావనిన్
అపారశోభమించునట్టి ఆ ధరిత్రిలోగొనన్
ప్రపాతరుష్టసర్పమయ్యె నా పటేలు ధీరతన్

33. శ్రీ బెజవాడ రామశేషయ్యగారు, దానశీలి, పరమభాగవతులు, విజయవాడ.
విషయము : శివరామకృష్ణక్షేత్రంలోని శ్రవణమందిరంలో శ్రవణం చేస్తూ రాజగోపురాన్ని దర్శించే భక్తుల భాగ్యాన్ని వర్ణించండి :

సతతము భక్తియుక్తులయి శాస్త్రపురాణపు హేతిహాస సం
తతి కడు శ్రద్ధతో వినుచు తత్త్వమహత్త్వమెఱుంగుచున్ మనో
జ్ఞతదగు రాజగోపురము గాంచి నమస్కృతిజేయు సజ్జన
ప్రతతికి జ్ఞానమోక్షములు భవ్యకరామలకంబులే గదా.



# సమస్యలు

1. డా॥ కె. గిరిజాలక్ష్మి.

సమస్య : రాజ్యము శాశ్వతంబయి విరాజిలు రాజులు లేకపోయినన్

ప్రాజ్యజయేతినాదములు వందిగణంబుల స్తోత్రపాఠముల్
పూజ్యములౌను రాజతతి పోయిన పిమ్మట కాని కావ్యసా
మ్రాజ్యము నందు తాను కవిరాజు గతించిన వేళలందునున్
రాజ్యము శాశ్వతంబయి విరాజిలు రాజులు లేకపోయినన్

2. శ్రీమతి టి. కె. చూడామణి.

సమస్య : సీతే! శీఘ్రం శివం భజ!

శీతాద్రీశ సుతే! బాలే, పరీక్షా చ కృతా మయా
ప్రేమరూపాత్మలాంగల్యా, సీతే! శీఘ్రం శివం భజ!

3. శ్రీమతి కె. రమాదేవి.

దత్తపది : శాంతి, దాంతి, క్రాంతి, కాంతి గాంధిమహాత్ముని
పునరాగమనం గూర్చి

శాంతియుతమైన యుద్ధంబు సలిపినాడు
దాంతి జీవనరీతిగా దనరినాడు
క్రాంతి భరతావనికి గూర్చె గాంధితాత
కాంతి కలిగింప మరల రాగలడు సుమ్ము

4. శ్రీమతి పి. భానుమతి.

సమస్య : అందరు నందరే మరియు నందరు నందరె అందరందరే

కొందరు నాయకాగ్రణులు కొందరుదంచిత శాస్త్రవేత్తల్లున్
కొందరు సత్కవీశ్వరులు కొందరు గాయకసార్వభౌములున్
కొందరు సత్కళానిధులు కూడిన ఈ బెజవాడ సీమలో
అందరు నందరే మరియు నందరు నందరె అందరందరే

5. శ్రీ కాపూరి పూర్ణచంద్రరావు.

సమస్య : కానికి కొనితెచ్చె వంద కమలాఫలముల్

కానీల కాలమేగెను
కానిది కాలమ్ము వచ్చె కష్టము తెచ్చెన్
మానిత! తులమెత్తగు కన
కానికి కొనితెచ్చె వంద కమలాఫలముల్

6. శ్రీ మల్లాది సుబ్రహ్మణ్యశర్మ.

సమస్య : కాముకం నమతి యోగిపుంగవః

నాస్తి చిత్రమిహ సత్కవీశ్వర!
ధ్యానలగ్నమతి రాత్తదర్శనః
మోక్షదాయక మనంగమాతృకా
కాముకం నమతి యోగిపుంగవః

7. డా॥ చివుకుల సుందరరామశర్మ.

సమస్య : భాషకు కీడు చేయగల పండితులుందురె యిజ్జగంబునన్

శేషఫణీంద్ర నాభిసరసీరుహజాత బృహస్పతీడ్య ని
శ్శేష సమస్త శాస్త్ర ఘనసింధువుగా వెలుగొందుచున్ జగత్
పోషకమైన సంస్కృతిని ప్రోదియొనర్చెడి తల్లియైన స్వర్
భాషకు కీడు చేయగల పండితులుందురె యిజ్జగంబునన్

8. డా॥ జంధ్యాల మహతీ శంకర్.

సమస్య : రంభకు నుద్భవించెనట రాముడు రావణు గుండె జల్లనన్

శంభుపదాబ్జసేవనవిశారదతాత్తవర ప్రభావుడై
దంభముతోడలోకముల తల్లడమందగజేయువాని దుర్
జృంభము మాన్పకోసల ధరిత్రిపపుత్రికి విష్ణుశక్తి సం
రంభకు నుద్భవించెనట రాముడు రావణు గుండె జల్లనన్

9. డా॥ కుందుర్తి సత్యనారాయణమూర్తి.

సమస్య : గాడిద గ్రుడ్డువెట్టె కలకాలము గాసిలకుండ నెల్లరున్

ప్రౌఢతనంబుతో గురుడు పూర్తిగ భారతమెల్ల జెప్ప వి
న్నాడవు ఓరి పుత్రక! మనంబున జ్ఞప్తి నశించిపోయెనే
చూడుము చెప్పెదన్ వినతనూ! తన దాస్యము విచ్చిపోవగా
గాడిద! గ్రుడ్డువెట్టె, కలకాలము గాసిలకుండ నెల్లరున్

10. డా॥ ముళ్లపూడి జయసీతారామశాస్త్రి

సమస్య : రావణేన నిహతో దశాననః

కేవలేన శ్రితలోక రక్షణే
పావకేన రిపులోక భక్షణే
మౌని బృంద విపులార్తి దుఃఖ వి
ద్రావణేన నిహతో దశాననః

11. శ్రీ మెట్టా వేంకటేశ్వరరావు.

సమస్య : తెలియనివారు భారతము దిద్దగ బూనుటదెంతభాగ్యమో

కలుగదు పొట్టనిండుగ నొకానొక పూటకునైన తిండియున్
నిలువగ నీడలేదు, హవణింపదు విద్దియ, వల్ దరిద్రతన్
వెలవెలబోవునట్టి నిరుపేదల కష్టము లెంతమాత్రమున్
తెలియనివారు భారతము దిద్దగ బూనుటదెంత భాగ్యమో

12. డా॥ కె. కె. విశ్వేశ్వరశాస్త్రి

సమస్య : మాతను పెండ్లియాడి జనమాన్యుడనంబడి పొందె
నున్నతిన్

ఆతతశక్తితో శివశరాసనభంగము జేసి తద్ధ్వనుల్
స్ఫీతతరంబులై దెసల ఫెళ్లు పెటిల్లని మ్రోయుచుండగా
ప్రీతిని జూడ గాధిజుడు ప్రేముడినారఘురాముడున్ జగ
న్మాతను పెండ్లియాడి జనమాన్యుడనంబడి పొందె నున్నతిన్

13. ఏ. వి. సుబ్బారావు.

సమస్య : నక్షత్రగ్రహసంచయంబు లెగసెన్ మధ్యాహ్న
కాలంబునన్

అక్షీణప్రతిభావికాసకలనావ్యాపారపారీణ! మీ
రక్షయ్యంబుగ నిచ్చినారిట సమస్యన్ సాధుభావంబునన్
దక్షా! రవ్యుపరాగవేళ కనరే? తత్పూర్ణతా స్ఫూర్తిలో
నక్షత్ర గ్రహ సంచయంబులెగసెన్ మధ్యాహ్న కాలంబునన్

14. శ్రీ వి. వి. సుబ్బారావు.

సమస్య : యోనిఁ దాకిన చేయి కాలేను సామి

హవ్యవాహన! అఘనాశ! ఆర్తపోష!
అనుచు కనుమూసి ధ్యానించునట్టివేళ
అతివ యజమానుననియె నాథా! కృపీట
యోనిఁ దాకిన చేయి కాలేను సామి!

15. డా॥ వై. నరసింహారావు.

దత్తపది : గలగల, జలజల, వలవల, మలమల

విషయం : భారతం

గలగలపారు జీవనదిగా వెలుగొందెడి వంశమందు క
జ్జలజల మొల్కఁజేసిన నృశంసుడు రాజని పెద్దలాడ, క్రే
వల వలదన్న పల్కులను వాయుసుతుండును రోజుచుండ, కో
మల మలయానిలంబటుల మాధవు సత్కృప కాచె ద్రౌపదిన్

16. శ్రీ వై. సోమసుందరరావు

సమస్య : వానరులెల్ల రొక్కటయి వర్ధిలు కాలము వచ్చుటెన్నడో

మానిత వైఖరిన్ మసలు మానవతాసముబుద్ధిలేక, ఎ
వ్వానికి వాడు నాడయిన వైఖరియే ఘనమంచు దుష్టతన్
పూని చరించుటొప్పగునె పొల్పగు నిండుమనంబుతోడ దే
వా! నరులెల్ల రొక్కటయి వర్ధిలుకాలము వచ్చుటెన్నడో

17. శ్రీ జంధ్యాల పరదేశిబాబు

సమస్య : తండ్రిని జంపినన్ సుతుడు ధార్మికుడంచును తీర్పు
కల్గెడున్.

తీండ్రముతోడ దుష్టుడయి దేవుడనేనయటన్న బుద్ధి పె
క్కండ్ర సురర్షులన్ దునిమి కావరమొప్ప హిరణ్యకశ్యపున్
తండ్రియటంచు చూడకయ దారకుడా హరి కప్పగింపగా
తండ్రిని జంపినన్ సుతుడు ధార్మికుడంచును తీర్పుకల్గెడున్

18 శ్రీ డి. ఆర్. చక్రవర్తి.

సమస్య : సింహము నెదిరించి గ్రామసింహము గెలిచెన్

రంహస్స్ఫూర్తి వచించెద
బృంహణమదియేల యొక్కవీటను, ఆటన్
సంహృతపు తోలుబొమ్మగు
సింహము నెదిరించి గ్రామసింహము గెలిచెన్

19. శ్రీ కె. పార్థసారధి

సమస్య : మందు జనులకు నిజముగ విందుగాదె

రమ్యవర్ణనా సౌభాగ్య ప్రాభవమున
తతసమస్యాది పద్య సంతతి చెలంగు
శతవధానమ్ము నీక్షించి సతము మోద
మందు జనులకు నిజముగ విందుగాదె

20. శ్రీ యం. వివేకానంద

సమస్య : కిస్మి శంకర యంచు సీత పతికిన్ కేల్మోడ్చి ప్రార్థింపదే

1ఆస్మేరాననయైన భార్య గనుచున్ ప్రాణేశుడిట్లాడెడిన్
2సుస్మార్గాపథమందు ధ్యానమున సంశోధించి భోక్తుండనున్
3భస్మీభూతుడవౌదువో దశగళా! పాపీ! యనన్,4 భార్యయున్
కిస్మి, శంకరయంచు, సీత, పతికిన్, కేల్మోడ్చి ప్రార్థింపదే

క్రమాలంకారంలో పూరణ

21. శ్రీ పైడిపాటి ఉమానాథశర్మ

సమస్య : జనసంఘుంబులకెప్పుడైన గలవా శాసించు సౌభాగ్యముల్

ఘనదౌర్జన్యమె పాలనార్హతగ చక్రంబెల్లెడన్ ద్రిప్పుచున్
జనులం జంపుచు నోట్లు గ్రుద్దుకొను దుష్టవ్రాతమే నాయక
త్వ నిధానంబును కొల్లగొట్టుకొనునా భవ్యాశయుల్ ధర్మవిత్
జనసంఘుంబుల కెప్పుడైన కలవా శాసించు సౌభాగ్యముల్

22. శ్రీ రాళ్లబండి నాగభూషణశాస్త్రి

సమస్య : కరులున్ మ్రింగవు మాయమౌ వెలగలున్ కంటే
విచిత్రంబహా!

ధరణిన్.మానవుడొక్కడే నిలువగా తజ్జంతు వృక్షంబులున్
త్వర లోకంబును వీడిపోయెడినహా! దౌస్థిత్యమేచెంగదా!
పరిరక్షావరివస్య చేయవలెనప్పా! వృక్ష సంతానమున్
కరులున్ మ్రింగవు మాయమౌ వెలగలున్కంటే విచిత్రంబహా!

23. శ్రీ బుఱ్ఱా భాస్కరశర్మ

నగరు, తగరు, తొగరు, వగరు-'హిందు' పదప్రయోగంపై
సుప్రీంకోర్టు తీర్పుపై

నగరు హిందూ పదంబు ఘనంబు కాగ
తగరు దూషింపనని తీర్పు తా వచించె
తొగ రుచిస్ఫూర్తి మొగముల తోచెనపుడు
వగ రుజయు మానె హిందూత్వ భావులందు

24. శ్రీ జె. శ్రీనివాస చక్రవర్తి

సమస్య : లేడీ విద్యకు స్వస్తిచెప్పి చనుటల్ లెక్కింప సంక్షేమమౌ

వాడింబోడిమి గల్గు పద్యములు లేవంజెప్పి మెప్పించినన్
ప్రోడన్నిన్నును మెత్తునంచునవురా! భూషించువారేరి? ధీ
ప్రౌఢన్ కష్టమెరుంగునట్టి సుజనస్వామిత్వసంభావ్యుడే
లేడీ విద్యకు స్వస్తిచెప్పి చనుటల్ లెక్కింప సంక్షేమమౌ

25. బి. యస్. ఆర్. మూర్తిగారు

సమస్య : మామను వధియించి చందమామగ వెలిగెన్

భూమిన్ సుజనావళి ర
క్షోమతియై కష్టపెట్టు క్రూరుని హరి తా
నై మనుతలేక కంసున్
మామను వధియించి చందమామగ వెలిగెన్

26. శ్రీ లంకా లక్ష్మీనరసింహశర్మ

సమస్య : షెడ్యూల్డ్ కాస్టులలో జనించుటకునై శీఘ్రంబు కాంక్షించెదన్

రాడ్యోగంబున తిండిబట్టలును సంరక్షన్ గనంజేసి బు
ద్ధీడ్యంబై తనరారు కొల్వులను ప్రీతింబిల్చి యిప్పింతురు నీ
ఆఢ్య ప్రక్రియ చూచి యొక్కడిటు తానారాటముం జెందడే
షెడ్యూల్డ్కాస్టులలో జనించుటకునై శీఘ్రంబు కాంక్షించెదన్

27. డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి

సమస్య : గడ్డము చేసికొమ్మనుచు కాంతుడు కాంతకు చెప్పె నవ్వుచున్

అడ్డములేని వేగమున నాతడు తాను క్రికెట్టు నాడుచున్
గొడ్డును బాదినట్టులుగ కొట్టెను బంతి జయమ్ము గాడిచె తా
విడ్డుర మొప్ప ముద్దుగొన వేగము వచ్చిన భార్యతో చెలిం
గడ్డము చేసికొమ్మనుచు కాంతుడు కాంతకు చెప్పె నవ్వుచున్

28. శ్రీ వేదాల రాజగోపాలాచార్యులు.
సమస్య : అల్లా, క్రీస్తును, వేంకటేశ్వరులహో! అయ్యప్పకున్ భక్తులే

సల్లాపంబుగ చెప్పుచుంటినిదిగో సర్వప్రపంచంబు తా
నెల్లన్ మేరను తిర్గుచుండుటది దేవీదృక్ప్రభావంబెయౌ
కల్లల్‌గావొక ఆదిశక్తి కలదౌ కానంగరానట్టిదై
అల్లా, క్రీస్తును, వేంకటేశ్వరులహో అయ్యప్పకున్ భక్తులే

అ+అప్ప=అయ్యప్ప=అమ్మవారు

29. శ్రీ చల్లా లక్ష్మీనారాయణ (సంస్కృతం).
సమస్య : శంకరోఽరమత సత్యభామయా

సౌరపుష్ప ఘనతాభివర్ణనే
నారదేన కృతమాత్మభేదనమ్
ప్రీణనేన ఘనతీవ్రకోప నా
శంకరోఽరమత సత్యభామయా

30. డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి.
సమస్య : పంకజమందు పంకజము భాసురమయ్యె నదేమి చోద్యమో

వంకలులేని సుందరత, వాలుకనుంగవ, నిండుచందురున్
లెంకగ బిల్చు మోము లవలీలత తానవమొప్పునట్టి ఓ
పంకజనేత్ర! నీ ముఖము స్ఫారసరోజమువోలె నొప్పగా
పంకజమందు పంకజము భాసురమయ్యె నదేమి చోద్యమో

31. డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి.

సమస్య : పాఠము చెప్పువారలకు బత్తెము లేటికి జీతమేటికిన్

పీఠము వెట్టి శిష్యులకు విద్దెలు పెద్దగ నేర్పువారికిన్
జాఠర బాధ తీరునటు సర్వమునున్ సమకూర్చునట్టి నై
శ్శాఠక రాజులున్నతరి సంతసమందరె దేశికోత్తముల్
పాఠము జెప్పువారలకు బత్తెములేటికి? జీతమేటికిన్

32. శ్రీ బెజవాడ రామశేషయ్యగారు.

వర్ణన : కురుక్షేత్రం, హృదయక్షేత్రం, వ్యవసాయక్షేత్రం, శివరామకృష్ణక్షేత్రం కలిపి వర్ణించండి.

భువిని కురుక్షేత్రంబగు
నవహృదయక్షేత్రమందునన్ ధర్మములన్
వ్యవసాయక్షేత్రంబై
శివరామక్షేత్రమిచట సేద్యము సేయున్

33. డా॥ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి (సంస్కృతం)

సమస్య : మాతైవ నాస్తీతి కిమత్ర చిత్రమ్

మాతః త్వదీయం కరుణా విలాసం
త్వద్భక్త సౌభాగ్య మహావిశేషం
చేయత్తయా మాతుమిహ ప్రభూతః
మాతైవ నాస్తీతి కిమత్ర చిత్రమ్॥

విద్యుత్ ప్రసారంలో అంతరాయంవలన 'ఆశువులు' సేకరించుటకు వీలుపడలేదు.

★★★

# ఆశీస్సులు - అభినందనలు

డా॥ శ్యామలానంద ప్రసాద్‌గారు ఈ ఏకదిన శతావధానాన్ని మనోజ్ఞంగా నిర్వహించారు. నేను మొదటినుండి చివరివరకు ఎంతో ఆసక్తితో విని ఆనందించాను. ప్రచారంలోనూ, అవధాని సమ్మాన విషయంలోనూ మా సారధ్య సంఘం చేయదగినంత చేయలేకపోయిందని నా భావన. అవధానిగారికి ఆ వేంకటేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించుగాక!

కోనేరు రామచంద్రరావు

డైరెక్టర్ : వాణీ విద్యాసంస్థలు; అధ్యక్షులు : సారధ్య సంఘం

మేమూ, అవధానిగారూ చిరకాల సాహితీమిత్రులం. ఎప్పటినుంచో అనుకుంటున్న ఈ ఏకదిన సంపూర్ణ శతావధాన కార్యక్రమం వదాన్యుల సహకారంతో మా లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ విద్యాధర ఆధ్వర్యంలో దిగ్విజయంగా జరగటం నాకెంతో ఆనందంగా ఉంది. తక్కువ వ్యయంతో, ఒక్కరోజులో ఒక 'కొత్త రికార్డు'గా జరిగిన ఈ శతావధానానికి పండితుల, రసజ్ఞుల, పత్రికల ఆదరణ ఎంతగానో లభించింది. 'పద్యం సదా సజీవం' అని మరోసారి నిరూపితమైంది. అందరికీ మా కృతజ్ఞతలు. 'శతావధాని' శ్యామలానంద ప్రసాదుగారికి అభినందనలు.

డా॥ జి. వి. పూర్ణచంద్

అధ్యక్షులు, లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ విద్యాధర

నా బాల్యస్నేహితుడు శ్యామలానంద ప్రసాద్ హైస్కూలునాటినుండి కవితాభ్యాసం చేయటం నాకు తెలుసు. మా నాన్నగారు తొలిసారి మంత్రి అయినప్పుడు పద్యాలు వ్రాసితెచ్చాడు. నేను నమ్మలేకపోయాను. ఆ తరువాత మా ఊళ్లో ప్రభాకర్‌జీ మొదలైన పెద్దల సమక్షంలో రెండు మూడుమార్లు అష్టావధానాలు చేసి ఆశీస్సులు పొందాడు. ఇప్పుడు ఈ ఏకదిన సంపూర్ణ శతావధానం విజయవాడ నగరంలో నిర్వహించి మా దివిసీమ కీర్తిపతాకను రెపరెపలాడించిన మిత్రుణ్ణి మనసారా అభినందిస్తున్నాను.

మండలి బుద్ధప్రసాద్

డి. సి. సి. అధ్యక్షులు, కృష్ణాజిల్లా

సకలాభ్యున్నత "పాలపర్తి" ఘనవంశ్యా! శ్యామలానంద! నే
డొకనాడైనను పూర్తియైనదియొ లేదో, యింతలోనే మహా
సుకవీశుండవు నీవు నీదు ప్రతిభాస్ఫూర్తిన్ ప్రదర్శించి, యే
రికి నెందున్ మునుపెన్నడున్ వినని దౌరీతిన్ వధానుల్, బుధుల్
సుకవుల్మెచ్చగ హృద్యపద్య కవితల్ శోభిల్ల నాయాసమం
దక ప్రజ్ఞావిభవంబుతో శతావధానంబున్ మనోజ్ఞంబుగా
నకలంకంబుగ సంస్కృతాంధ్రముల యందత్యంత హేలాగతిన్
సకలోర్వీతలమందుఁ బేరును ప్రతిష్ఠల్ గల్గగాఁ జేసితౌ।

బ్రహ్మశ్రీ ముదిగొండ శివరామశాస్త్రి
ప్రిన్సిపాల్ (రి) ఓరియంటల్ కళాశాల, అగిరిపల్లి

అస్మన్మిత్రులు డా॥ పాలపర్తి శ్యామలానందప్రసాద్‌గారు 24-12-95న ప్రప్రథమముగా శివరామకృష్ణ క్షేత్రములో నొనర్చిన ఏకదిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానము కవిపండితులయు, సహృదయులయిన విజయవాడ పౌరులయు ప్రశంసలకు పాత్రమై ప్రసిద్ధ దినపత్రికలన్నిటిచే కొనియాడబడుట ఎంతయు ముదావహము.

వీరి అవధానములో ఉభయభాషా పాండిత్యము, ప్రతిభ, కవితా పాటవము, సమయస్ఫూర్తి, చతుర వచఃఫణితి, ఆశుకవితాధోరణి తగురీతిని చోటుచేసికొనుట ముఖ్యముగా గమనింపదగినది. ఇందులకు వీరు ఈ శతావధానములో మనోజ్ఞముగా బూరించిన సమస్యలు, చేసిన వర్ణనలు, చెప్పిన ఆశుపద్యములు మనకు నిదర్శనములు. పృచ్ఛకులు కొన్ని బహు క్లిష్టములైన సమస్యలు, వర్ణనములు ఇచ్చినారు. వీనిలో చాలవరకు జాతీయ సమైక్య భావముతో గూడియుండుట విశేషము. సమస్యలలో దుష్కరప్రాసము గలవి, అశ్లీలార్థమునకు తావలమైనవి, చమత్కార జనకములును వైరుధ్య ద్యోతకములు ఎన్నో గలవు. వానినన్నింటిని మన అవధాని సునాయాసముగా అనూహ్యమైనరీతిలో సమయస్ఫూర్తితో చమత్కరించి చెప్పి వారి బహుముఖమైన పాండిత్యమును చాటినారు.

"శతావధానే భవదీయ ప్రజ్ఞా
నిరంతరం రాజతు సత్సభాసు,
హే శ్యామలానంద! కవీంద్ర! సాధో!
ఏషామదాశీర్విజయాయభూయాత్."

శ్రీ మల్లాది సుబ్రహ్మణ్యశర్మ
అధ్యక్షులు, రసభారతి

1. ఆంధ్ర గీర్వాణ భాషాద్వయమ్ము నందు
నిర్వహించె వధాన మపూర్వరీతి
ఏక దినమందె - ముదమంద లోకమెల్ల
శ్యామలానంద సత్కవి చంద్రముండు!!

2. సుందర భావపూర్ణయు-రసోజ్జ్వల శబ్దప్రయోగ వై భవా
నందసుధాప్రసారసుగుణాన్వితయై-సుమనో మనోజ్ఞయై
వందిత పాదపద్మమయి భాసిలె శారద నేడు - శ్యామలా
నంద వరప్రసాద కవినాథ వధాన విహారలాస్యయై

మహతీశంకర్

ఆమాతామహ, మాచ తద్గురువరం ప్రాప్తా తవేయం కళా,
సద్బుద్ధిర్నికషాయితా, శతవిధ ప్రశ్నోత్తరాధాయినీ।
ఏకాహ్నికృత సంవిధాన ఘటకం సచ్ఛేముషీ శోభితం
నైదంపూర్వవిధావధాన రసికం శ్రీ శ్యామలం నందయేః॥

డా॥ ముళ్లపూడి జయసీతారామశాస్త్రి

'ద్య' ప్రాసాదుల నిచ్చువారిగని స్మేరాస్యుండవై నీమనీ
షా ప్రాబల్యము, శబ్దసంపదయు సుశ్లాఘ్యంబు తానంచు మే
ధా ప్రఖ్యాతులు ప్రాశ్నికోత్తమసభాస్తారుల్ ప్రశంసింపగా
నీ ప్రజ్ఞన్ ప్రకటించినావు భళిరా! నేడీ సభన్ మిత్రమా!

డి. ఆర్. చక్రవర్తి

సుందర భావ సంచయము సుందరశబ్ద సమూహ మొప్పగా
అందర డెందముల్ తనియ హాయిగ మీరు శతావధానమున్
విందును చేసినారు; తమ వేత్తృత నెంతని మెత్తు! శ్యామలా
నంద ప్రసాదరాయ కవినాయక! పద్యలతాంత సాయకా!

డా॥ చేరెడ్డి మస్తాన్‌రెడ్డి

ఉ॥ ఇంతటి ధార ధారణయు
నీశ్వర సత్కృపచే లభించ, ది
గ్దంతుల వంటి పృచ్ఛకుల
ధాటి నెదుర్కొని నిల్చినావు; సు
స్వాంతులు 'మేలు మే'లనుచు
ప్రస్తుతి చేయగ నీ వధానమున్
సాంతము నిర్వహించితివి
సత్కవి గేయ! ప్రసాద్ మహాశయా!

డా॥ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి

అతికష్టంబు శతావధానమను వాక్యంబు న్మృషంజేసి పం
డిత లోకంబు ప్రమోదమగ్నమగు ప్రౌఢిన్ శ్యామలానందు డు
న్నతుడై సత్కవితా సుధారసము చిందన్ పృచ్ఛకశ్రేణి ప్ర
శ్నతతిన్ గూరిచియిచ్చె నుత్తరములన్ సద్యస్స్ఫురద్ధీమతిన్

'అవధాని శిరోమణి' రాళ్ళబండి నాగభూషణశాస్త్రి

తెలుగునేల పుట్టి వెలుగు తేజమే సు
మా! చదువు నేర్పి విద్యార్థి మానసాల
సాకు శ్యామలానంద ప్రసాదు.... అందు
కో ప్రశంసల హారము గుచ్చియిత్తు.

జంగం శ్రీనివాస చక్రవర్తి

శ్రీకల్యాణ శతావధాన ప్రతిభల్ శ్రీ శ్యామలానూర్ప్వర్తి నా
రాకా పూర్ణసుధాంశు మంజులవితా లావణ్య వాగ్ధార సు
శ్లోకాలార్భటి సార్థకార్థకముగా రూపొంది చెల్వొందుచున్
శ్రీకారంబయి ఈవధాని పలుకున్ శ్రీ శారదా సత్కృపా
స్తోకోద్దీప్తిది ఈప్సితార్థముల బ్రోచున్ శ్యామలానందునిన్॥

డా॥ కుందుర్తి సత్యనారాయణమూర్తి

భారత భారతీ పాదోధి ప్రభవించి
అవధాన కళలతో నలరినావు
సంస్కృత సాహితీ సంశోధనము జేసి
పండిత మౌళివై పరగినావు
స్నేహ విభవమున జేసి మిత్రులతోడ
మిక్కిలి ప్రేముడి మెలగినావు
విజయవాటికలోన విమల శతావధా
నులు లేరను కొరత తొలగిపోవ

శతవధానము నేర్పుతో సలిపినావు
శతశతావధానములు దశదిశలందు
చేసి శ్యామలానందుడా చెలగుమయ్య
ఆయురారోగ్య వైభవమందుమయ్య

పింగళి వెంకటకృష్ణారావు

తే॥ శ్యామలానంద! ఘనయశః ప్రాప్తిరస్తు
శ్యామలానంద! సౌభాగ్యమస్తు! నీకు
శ్యామలానంద కందళితాంతరంగ
శ్యామలానంద నీకు చిరాయురస్తు

వంగల రామమూర్తి

అవధానానికి మళ్ళీ మంచిరోజులొచ్చాయనిపిస్తున్నది ఇప్పుడున్న సాహిత్య వాతావరణం చూస్తుంటే. దాని కనుగుణంగానే ప్రజలు కూడ అవధానాలపట్ల అవధానచిత్తులవుతున్నారు.

అవధానశేఖరులైన శ్యామలానంద ప్రసాదుగారి ఏకదిన సంస్కృతాంధ్ర సంపూర్ణ శతావధానంలో నాకు నచ్చిన విషయమేమిటంటే - వారు చెప్పిన పద్యాలన్నీ "ఉదాత్తభావస్ఫోరకంగా" ఉండటం. ఇది వారి అవధానంలోని ప్రత్యేక లక్షణం. ప్రసాదుగారి శతావధాన పద్యాలు దాదాపు అన్నీ కూడ విషయానుగుణమైన శైలితో, హృదయాహ్లాదకరమైన భావనతో సుందరంగా పొందుబడటం ఆనందాన్ని కల్గించింది.

డా॥ కె. గిరిజాలక్ష్మి

అవధాన కవిత్వమనగా తట్టలనో బుట్టలనో అల్లి పారవేయుట వంటిది. భావమా! రసమా! అలంకారమా! వ్యాకరణ ఛ్ఛందోదోషములు లేకున్న చాలును. అవి యుండుటయు తర్వాత పరిష్కరించుకొనుటయు కూడ గమనించియే యున్నాము.

అట్టి యవసరమేమాత్రము లేనంత చక్కగా అవధానము సాగినది. పదముల పొందికయందుగాని పద్యగతియందు కాదు "నట్టు" అను మాట లేదు. పద్యమందు అర్థము, భావము, రసము, అలంకారము, ఔచిత్యము, ధ్వని మున్నగు కావ్యవిషయములగూర్చి నిత్యము బోధించు అధ్యాపకుడగుటచే వ్యర్థపదములు దొర్లకుండ సరసమగు భావముతో పద్యము కూర్పవలయు నన్న కోరిక వేగమును కొంత నిరోధించినది. అయా ఆలోచనమును పూర్తిగా విసర్జించును గాక! శతావధానములపై తెగబడుగాక! అని నా ఆశీస్సు!

శ్రీ మెట్ల వెంకటేశ్వరరావు

శత శతావధానమ్ములు సలిపి శత శతములు ఆయురారోగ్య ఐశ్వ ర్యాభివృద్ధి నొంద శంకరుడు మిమ్మనుగ్రహించుగాత! మిమ్ము శతావధానీ!

చల్లా లక్ష్మీనారాయణ

ఎప్పుడో డెబ్భై సంవత్సరాల క్రితం తిరుపతి వేంకటకవులు విజయవాడలో నివసిస్తున్నప్పుడు ఇక్కడ శతావధానం చేశారుట! ఆ తరువాత విజయవాడ నివాసి, విజయవాడలో, ఒకేరోజున, అందునా సంస్కృతాంధ్రాలలో ఈ అవధాన కార్యక్రమం పూర్తిచెయ్యటం విజయవాడ పౌరుల మహద్భాగ్యం.

శతావధాని డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్‌గారు భవిష్యత్తులో ఇలాటి కార్యక్రమాలు అనేకం చేపట్టి కృతకృత్యులు కావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

క్రోవి పార్థసారథి, శ్రీమతి క్రోవి రమాదేవి

సాహిత్యం ఆలోచనామృతాన్ని అందించే పయోధరమని ఆర్యోక్తి. ఇంటిపేరులోనే పాలశబ్దాన్ని కలిగియున్న అవధానిగారి పద్యాలు ఆలోచించిన కొద్దీ రసస్ఫూర్తిని కలుగచేస్తాయి. ఏదో ఒక పద్యంతో పూర్తిచేద్దామనే ధోరణి ఆయనలో కనబడదు. ఆలస్యం అయినకొద్దీ సభికులు విసుగు చెందుతారని రసహీనం అయిన పద్యం చెప్పివేయడం ఆయనకు చేతకాదు. ఎంతటి అనుచిత ధోరణిలో ఉన్న ప్రశ్ననైనా హాస్యభరిత ప్రసంగాన్నైనా శాంతరసంతో కూడిన ముగింపును ఇవ్వడంలో ఈయన అద్వితీయుడు. సాహిత్యంపట్ల చెదరని ఆసక్తి గలవారికీ, సహృదయులకూ, శాంతికాముకులకూ పాలపర్తివారి అవధానం చతుర్విధపదార్థభరితమైన విందు.

బి. శ్రీరామచంద్రమూర్తి

పద్యపూరణ కేవలం పూరణను దృష్టిలో పెట్టుకొని తమ భారాన్ని దింపుకోవటం కాకుండా భావయుక్తంగా పద్యాన్ని పూరించడం అనేది శ్యామలానందుల ప్రత్యేకత. వారి ప్రతి పద్యం ఒక రసగుళిక అనడం ఏమాత్రం అతిశయోక్తి కాదు.

సంస్కృతాంధ్రాలలో అదీ ఒకరోజులో శతావధానం నిర్వహించడం అనేది అద్భుత విషయంగా రసజ్ఞులు భావించారు.

అప్రస్తుత ప్రసంగం తమ ఏకాగ్రతకు ఎంత భంగం కలిగిస్తున్నా ఏమాత్రం ఉద్విగ్నత పాలవ్వకుండా మందస్మితవదనంతో సమాధానాలివ్వడం అందరినీ అలరించిన ప్రత్యేక విషయం.

విజయవాడలో శతావధానులు లేని లోటు మా సోదరులు తీర్చారు. ఇది విజయవాడకే కాక సాహిత్య జగత్తుకే గర్వకారణం. వీరింకా ఎన్నో శతసహస్రావధానాలు చేయాలని, ఆ శక్తి పరమాత్మ వారికి అనుగ్రహించా లని ప్రార్థిస్తూ వారికి హృదయపూర్వక అభినందనలు అందజేస్తున్నాను.

**శ్రీమతి టి. కె. చూడామణి**

చిరంజీవి శ్యామలానందప్రసాదుని అష్టావధాన, శతావధానములలో నేను పృచ్ఛకుడుగా చాలాసార్లు పాల్గొన్నాను. అతనిది మంచిధార, సరస కవిత్వము. ఎక్కడికక్కడ ఆలోచించుచు చక్కగా ముందు వెనుకలతుకునట్లు చెప్పుటయే కాక, సమస్యలు, దత్తపదుల విషయము చాల చక్కగా సమకూర్చును. పద్యములు మరొక్కసారి చదువ వీలుగా ఉండును.

ఇంకను ఇటువంటి అవధానములెన్నో చేసి సాహితీప్రియుల మనస్సులకు విందొనగూర్చి మెప్పుపొందుగాక యని దీవించుచున్నాను.

**డా॥ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి**

## ఆంధ్రజ్యోతి, విజయవాడ 25-12-95

సత్యనారాయణపురం, డిసెంబరు 24 (స్పాట్‌న్యూస్); జాతీయ సమైక్యతా నినాదంతో ఒక్కరోజులో ప్రప్రథమంగా ఆదివారం నిర్వహించిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం వైభవంగా జరిగింది. సత్యనారాయణ పురం శివరామకృష్ణక్షేత్రం ఆవరణలో ఆదివారం లయన్స్ క్లబ్ ఆఫ్ విద్యాధర అధ్వర్యంలో సయ్యద్ అప్పలస్వామి కళాశాల అధ్యాపకులు డాక్టర్ పాలపర్తి శ్యామలానందప్రసాద్ సంస్కృతాంధ్ర శతావధానం నిర్వ హించి విద్వాంసుల, పీఠాధిపతులు, నగర ప్రముఖుల ఆశీస్సులు పొందారు. అవధానరంగంలో ఇప్పటివరకు జరిగిన శతావధానాలన్నీ రెండు రోజులలో నిర్వహింపబడేవి. అయితే ఆదివారం కొత్త ప్రయోగంగా ఈ అవధానం ఒక్కరోజులో నిర్వహించారు. అంతేకాక 34మంది పృచ్ఛకులు నూరు అంశాలు ఇచ్చేవిధంగా సంస్కృతాంధ్ర భాషాంశాలలో నిర్వహించారు. గత పది సంవత్సరాలనుంచి విజయవాడ నగరంలో శతావధాన కార్యక్రమం జరగలేదు. ఒకరోజులో శతావధానం చేయడం, అలాగే శ్యామలానంద ప్రసాద్ శతావధానం చేయడం కూడా ఇదే ప్రథమం........

విజయవాడలో శతావధానులు లేని లోటు మా సోదరులు తీర్చారు. ఇది విజయవాడకే కాక సాహిత్య జగత్తుకే గర్వకారణం. వీరింకా ఎన్నో శతసహస్రావధానాలు చేయాలని, ఆ శక్తి పరమాత్మ వారికి అనుగ్రహించాలని ప్రార్థిస్తూ వారికి హృదయపూర్వక అభినందనలు అందజేస్తున్నాను.

**శ్రీమతి టి. కె. చూడామణి**

చిరంజీవి శ్యామలానందప్రసాదుని అష్టావధాన, శతావధానములలో నేను పృచ్ఛకుడుగా చాలాసార్లు పాల్గొన్నాను. ఆతనిది మంచిధార, సరస కవిత్వము. ఎక్కడికక్కడ ఆలోచించుచు చక్కగా ముందు వెనుకలతుకునట్లు చెప్పుటయే కాక, సమస్యలు, దత్తపదుల విషయము చాల చక్కగా సమకూర్చును. పద్యములు మరొక్కసారి చదువ వీలుగా ఉండును.

ఇంకను ఇటువంటి అవధానములెన్నో చేసి సాహితీప్రియుల మనస్సులకు విందొనగూర్చి మెప్పుపొందుగాక యని దీవించుచున్నాను.

**డా॥ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి**

## ఆంధ్రజ్యోతి, విజయవాడ 25-12-95

సత్యనారాయణపురం, డిసెంబరు 24 (స్పాట్‌న్యూస్); జాతీయ సమైక్యతా నినాదంతో ఒక్కరోజులో ప్రప్రథమంగా ఆదివారం నిర్వహించిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం వైభవంగా జరిగింది. సత్యనారాయణ పురం శివరామకృష్ణక్షేత్రం ఆవరణలో ఆదివారం లయన్స్ క్లబ్ ఆఫ్ విద్యాధర ఆధ్వర్యంలో సయ్యద్ అప్పలస్వామి కళాశాల అధ్యాపకులు డాక్టర్ పాలపర్తి శ్యామలానందప్రసాద్ సంస్కృతాంధ్ర శతావధానం నిర్వహించి విద్వాంసుల, పీఠాధిపతులు, నగర ప్రముఖుల ఆశీస్సులు పొందారు. అవధానరంగంలో ఇప్పటివరకు జరిగిన శతావధానాలన్నీ రెండు రోజులలో నిర్వహింపబడేవి. అయితే ఆదివారం కొత్త ప్రయోగంగా ఈ అవధానం ఒక్కరోజులో నిర్వహించారు. అంతేకాక 34మంది పృచ్ఛకులు నూరు అంశాలు ఇచ్చేవిధంగా సంస్కృతాంధ్ర భాషాంశాలలో నిర్వహించారు. గత పది సంవత్సరాలనుంచి విజయవాడ నగరంలో శతావధాన కార్యక్రమం జరగలేదు. ఒకరోజులో శతావధానం చేయడం, అలాగే శ్యామలానంద ప్రసాద్ శతావధానం చేయడం కూడా ఇదే ప్రథమం.......

సాయంత్రం జరిగిన సన్మానసభలో ముఖ్యఅతిథిగా విశాలాంధ్ర ఎడిటర్ సి. రాఘవాచారి. ఎస్. ఆర్. ఆర్. కళాశాల ప్రిన్సిపాల్ కె. జి. వి. హరివిఠల్ అవధానిని అభినందించారు. ఈ సందర్భంగా డాక్టర్ శ్యామలానంద ప్రసాద్‌ను నిర్వాహకులు ఘనంగా సన్మానించారు. పృచ్ఛకులను కోనేరు రామచంద్రరావు అభినందించారు. అవధానిని బాలాజీ స్వామి ఆశీర్వదించారు. ఈ కార్యక్రమంలో లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ విద్యాధర అధ్యక్షులు డాక్టర్ జి. వి. పూర్ణానంద్, కార్యదర్శి జె. కృష్ణకుమార్ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ విద్యాధర వారు అవధానిని 'శతావధాని శేఖర' అను బిరుదుతోను, దేవి ఫౌండేషన్ వారు 'అవధాన సుధానిధి' అనే బిరుదుతోను సత్కరించారు.

## ఆంధ్రప్రభ, విజయవాడ 25-12-95

విజయవాడ, డిసెంబర్ 24 : సత్యనారాయణపురం, శివరామకృష్ణ క్షేత్రంలో డాక్టర్ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ నిర్వహించిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం రసజ్ఞులను, సాహితీవేత్తలను విశేషంగా అలరించింది. అత్యంత ఉల్లాసభరితమైన వాతావరణంలో ఆదివారంనాడు జరిగిన శతావధాన కార్యక్రమానికి సాహిత్యప్రియులు పెద్దసంఖ్యలో హాజరయ్యారు.

జాతీయ సమైక్యతా నినాదంతో ప్రపథమంగా విజయవాడలో ఈ రకమైన కొత్త ప్రయోగం జరగడం విశేషం........

పృచ్ఛకుల ప్రశ్నలకు ఎంతో సమయస్ఫూర్తితో, భాషాపటిమ, వాక్చాతుర్యంతో డాక్టర్ శ్యామలానందప్రసాద్ సమాధానం చెప్పిన తీరు రసజ్ఞులను రస సముద్రంలో ఓలలాడించింది.

శ్రీ భగవాన్ సత్యసాయిబాబా, శ్రీమతి లక్ష్మీపార్వతి, శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీ చంద్రబాబునాయుడుల గురించి ప్రశ్నలు ఎదురైనప్పుడు శ్రీ ప్రసాద్ సమస్యాపూరణం చేసిన తీరు పలువురి ప్రశంసలందుకుంది......

## ఈనాడు, విజయవాడ 25-12-95

సత్యనారాయణపురం, డిసెంబరు 24 (న్యూస్‌టుడే) : సయ్యద్ అప్పలస్వామి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులైన డాక్టర్ పాలపర్తి శ్యామలానందప్రసాద్ ఆదివారం సత్యనారాయణపురంలోని శివరామకృష్ణ క్షేత్రంలో

నిర్వహించిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధాన కార్యక్రమం వివిధ వర్గాల వారిని విశేషంగా ఆకట్టుకుంది. జాతీయ సమైక్యతా నినాదంతో ఈయన అవధానాన్ని చక్కగా నిర్వహించారు. గత పది సంవత్సరాలలో విజయవాడ నగరంలో శతావధాన కార్యక్రమం జరగటం ఇదే ప్రథమం. శ్యామలానంద ప్రసాదు శతావధానం చేయడం కూడా ఇదే ప్రథమం.......

ఆదివారం ఉదయం 9 గంటలకు ప్రారంభమైన అవధాన ప్రక్రియ రాత్రి 8-30 గంటలకు పూర్తయింది. ప్రారంభోత్సవ కార్యక్రమంలో ముఖ్య అతిధిగా పాల్గొన్న డి.సి సి. అధ్యక్షుడు మండలి బుద్ధ ప్రసాద్ ప్రసంగిస్తూ పద్య ప్రక్రియకు ఆదరణ కరవైన ఈ రోజులలో ఇటు వంటి కార్యక్రమం ఏర్పాటు చేయడం సంతోషించదగ్గ విషయమన్నారు. అవధానాలు నిర్వహించేందుకు ప్రభుత్వ సహకారం, పెద్దల ప్రోత్సాహం అవసరమన్నారు. రాత్రి జరిగిన కార్యక్రమంలో అవధానిని లయన్స్ క్లబ్, బ్రహ్మయ్య అండ్ కంపెనీ, దేవీ ఫౌండేషన్స్ సంఘంవారు తదితరులు సన్మానించారు. సి. రాఘవాచారి, బాలాజీస్వామి, కె.జి.సి. హరివిఠల్ తదితరులు అవధానిని అభినందించారు........

## ఆంధ్రభూమి, విజయవాడ 25-12-95

విజయవాడ, డిసెంబర్24 : జాతీయ సమైక్యత ప్రధానాంశంగా స్థానిక శివరామకృష్ణ క్షేత్రంలో ఆదివారం ఉదయం జరిగిన సంస్కృతాంధ్ర శతావధానం సాహితీప్రియుల మన్ననలందుకొంది. లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ, విద్యాధరపురం నిర్వహణలో సయ్యద్ అప్పలస్వామి కళాశాల ఆంధ్రోపన్యాసకుడు, 'అవధాన కళానిధి', 'అవధాన శారద' బిరుదులు పొందిన డాక్టర్ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్‌చే ఈ కార్యక్రమం రమ్యంగా సాగింది........

సమస్య, వర్ణన, ఆశువు అంశాలలో ఒక్కొక్కరూ మూడు అంశాలపై ప్రశ్నలడగటంతో సంస్కృతాంధ్ర శతావధానం ఉదయం నుండి సాయంత్రం వరకూ రక్తిగా నడిచింది. అవధాన రంగంలో తనకంటూ ఒక చక్కని గుర్తింపు పొందిన డాక్టర్ పాలపర్తి ఈ శతావధానాన్ని సంస్కృతాంధ్ర భాషల్లో తనకున్న కృషిని ప్రతిబింబింపచేస్తూ దీనిని నిర్వహించటంలో కృతకృత్యులయ్యారు........

★★★

మన విజయవాడలో శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ "ఏకదిన సంస్కృతాంధ్ర శతావధానం" చేసి మరొక అవధాన శకానికి ప్రారంభకులై కీర్తి పొందారు. ఈ ప్రయత్నం చాలా మెచ్చుకోదగినది. కాలం, ధనం, ఖర్చుచేయటానికి వెనుకంజ వేస్తున్న, జంకుతున్న ఈ తరానికి ఈ 'ఏకదిన శతావధాన' ప్రయత్నం సాహిత్యాభిమానులకందరికీ ప్రోత్సాహకరం.

వారు చేసిన ఈ శతావధానానికి అక్షరాకృతి కల్పించటానికి తనంతట తానుగా ముందుకు వచ్చిన శ్రీ చెవుటూరి తాండవకృష్ణ, శ్రీమతి కుసుమకుమారి (చెవుటూరి చారిటబుల్ ట్రస్టు) దంపతులు బహుధా ప్రశంసనీయులు.

అవధానికి, అక్షరకర్తకు శారదామూర్తి సహస్రధా ఆశీస్సులు అందించి అనుగ్రహించగలందులకు ప్రార్థిస్తున్నాను.

డా॥ చివుకుల సుందరరామశర్మ

శతావధానం మనోజ్ఞంగా జరిగింది. ఆ విశ్వేశ్వరుడు 'శతావధాని' శ్యామలానందునిచేత మరింత సాహిత్యసేవ చేయించు గాక!

డా॥ కె. కె. విశ్వేశ్వరశాస్త్రి

ఈ ఏకదిన సంపూర్ణ శతావధానంలో పృచ్ఛకునిగా పాల్గొన్నందుకు, సాహిత్య రసాస్వాదన చేయగలిగినందుకు నాకు ఎంతో ఆనందంగా ఉంది. అవధానికి ఆశీస్సులు.

ఎ. వి. సుబ్బారావు

సయ్యద్ అప్పలస్వామి కళాశాలలో మా సహాధ్యాపకులు, మా ప్రియ మిత్రులు డా॥ శ్యామలానంద ప్రసాద్ ఒక్కరోజులో సంస్కృతాంధ్ర సంపూర్ణ శతావధానం చేసి 'క్రొత్త రికార్డు' సృష్టించటం, మేము పృచ్ఛకులమై ఆద్యంతమూ చెవులారా 'చూసి', కళ్లారా 'వినగలగటం' మాకు గర్వానందంగా ఉన్నది.

డా॥ వై. నరసింహారావు
వి. వి. సుబ్బారావు
వై. సోమసుందరరావు

మిత్రులు శ్యామలానంద ప్రసాదుగారి ఏకదిన సంపూర్ణ శతావధానం రమణీయం. కమనీయం.

**జింధ్యాల పరదేశిబాబు**

క్లిష్టమైన సమస్యనిచ్చి అవధానిగారిని బాధించి మంచి పూరణ సాధించినందుకు సంతోషంగా ఉంది.

**ఘరుధూరి వివేకానంద**

భావుకత్వమూ, పాండిత్యమూ, సమయస్ఫూర్తీ, చాతుర్యమూ నిండిన పాలపర్తివారి శతావధానం రసికజన మనోఽభిరామం.

**పైడిపాటి ఉమానాథశర్మ**

సమకాలీన సమస్యలపై నేనడిగిన అంశాలకు చాలా చక్కని పద్యాలు వచ్చాయి. అవధానిగారికి అభినందనలు.

**బుఱ్ఱా భాస్కరశర్మ**

మావారిచేత 'ఏకదిన సంపూర్ణ శతావధానం' విజయవంతంగా చేయించ గలిగినందుకు నాకు ఆనందం తలకెక్కింది. (పురుషుని విజయం వెనుక స్త్రీ ఉంటుందని అవి సామెత కదా!)

**భానుమతి**



# నా అవధాన ప్రస్థానంలో మణిస్తంభాలు

★ 1977 డిసెంబరు, పొన్నూరు
తొలి అష్టావధానం, శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కళాశాల, గురువుల సమక్షంలో.

★ అవనిగడ్డ - 1978 ఆగస్టు 15
ప్రభాకర్‌జీ, శ్రీ మండలి వెంకటకృష్ణారావు మొ॥న పెద్దల సమక్షంలో.

★ బందరు - 1985
ఆంధ్ర సారస్వత సమితి - 'అవధాన కళాసరస్వతి' బిరుద ప్రదానం, కీ॥శే॥ అద్దేపల్లి లక్ష్మణస్వామి, భావరాజునరసింహారావు మొ॥వారి సమక్షంలో.

★ విజయవాడ - 1985 మార్చి
తొలి ద్విగుణిత అష్టావధానం.

★ విజయవాడ - 15-8-85
చతుర్గుణితాష్టావధానం.

★ కడప - 24-4-85
శ్రీ పేరాల భరతశర్మగారి అధ్యక్షంలో.

★ గుంటూరు - 1-12-85
డా॥ బేతవోలు రామబ్రహ్మంగారి అధ్యక్ష్యంలో.

★ గుంటూరు - 11-10-86
డా॥ ప్రసాదరాయ కులపతిగారి అధ్యక్ష్యంలో.

★ బందరు - 11-1-87
శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానందస్వామివారి సమక్షంలో.

★ విజయవాడ - 1989 అగస్టు
ప. ప. పుష్పగిరి పీఠాధిపతుల సమక్షంలో.

★ గుంటూరు - ప్రజాపతి ఉగాది
శ్రీ విశ్వయోగి విశ్వంజీ, 'కరుణశ్రీ'గారల సమక్షంలో.

★ హైదరాబాదు - 91 నవంబరు
'మల్లెమాల' యం. యస్. రెడ్డిగారి అధ్యక్ష్యంలో.

★ విజయవాడ - 91, శివరాత్రి
ప. ప. కుర్తాళం పీఠాధిపతుల సమక్షంలో - స్వామివారిచే
'అవధాన శారద' బిరుద ప్రదానం.

★ విజయవాడ - 92, జనవరి
'అవధాన కళానిధి' బిరుద ప్రదానం.

★ విజయవాడ - 92, జనవరి
'అవధానం ఇంటర్నేషనల్' (అమెరికా) వారి వీడియో ఇంటర్వ్యూ.

★ విజయవాడ - 24-12-95
ఏకదిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం, లయన్స్, పుర ప్రముఖులచే 'శతావధానిశేఖర' బిరుద ప్రదానం. దేవీ ఫౌండేషన్స్ వారిచే 'అవధాన సుధానిధి' బిరుద ప్రదానం. 'శతావధానం'పై ఆకాశవాణి, విజయవాడ కేంద్రం ఇంటర్వ్యూ. 'చెవుటూరి ఛారిటబుల్ ట్రస్టు' వారిచే శతావధాన సంచిక ముద్రణ.

ధీగతులు వార్తతులు ధీరమతి సంగతులు
తెల్లపుఁ జమత్కృతులు నిండన్
వేగమయ పద్యములు విస్ఫురితగద్యములు
విజ్ఞజనహృద్యములు కాగన్
స్వాగతముఖాబ్జముల సభ్యతతి మెచ్చుకొన
సాగెడు వధానకళతోడన్
ప్రాగుదిత పుణ్యమున బాలుడను నిన్గొలుతు
బ్రహ్మసతి! మంగళమహాశ్రీ





జననం : 3-10-1957 విజయదశమి

తల్లిదండ్రులు : శ్రీమతి పూర్ణాంబ, బ్రహ్మశ్రీ వేంకటసుబ్బారావు

స్వస్థలము : అవనిగడ్డ, కృష్ణాజిల్లా

విద్యార్హతలు : భాషాప్రవీణ, పి. ఒ. యల్.
ఎం. ఎ. (తెలుగు); ఎం. ఎ. (సంస్కృతం)
పిహెచ్.డి.(తెలుగు), (పిహెచ్.డి.)(సంస్కృతం)

అధ్యాపకత్వం : 1978 నుండి- సయ్యద్ అప్పలస్వామి కళాశాల
విజయవాడ - 9.

రచనలు : శాంతిసూక్తమ్(సం) ధర్మసూక్తమ్(పద్యకావ్యం)
జైనధర్మశతకము, శతవిఘ్నేశ్వరీయము
పద్మవంశి, శ్రీకృష్ణోదాహరణము, మొ॥

అవధానవిద్య : నూటికిపైగా అష్టావధానాలు - పీఠాధిపతుల,
పెద్దల ఆశీస్సులు
ద్విగుణిత, చతుర్గుణితాష్టావధానములు
ఏకదిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానము

బిరుదములు : అవధాన కళాసరస్వతి, అవధాన శారద,
అవధాన కళానిధి, అవధాన సుధానిధి
శతావధానిశేఖర.